శ్రీ

# శిలాదిత్యనాటకము.

చరిత్ర నాటకము.

ఇది
బళ్ళారిలో ప్లీడరుగా నుండిన

కీ. శే. బ్రహ్మశ్రీ కోలాచలం శ్రీనివాసరావుచే
రచియింపఁబడినవి.

కె. శత్రుఘ్నరావుచే

ప్రకటింపఁబడియె.

మొదటికూర్పు.

బళ్ళారి.
ఆంధ్రాముద్రాక్షరశాలయందు
ముద్రితము.
1921



వెల రు. 1—0—0

# శ్రీనివాససుకవి జీవితచరిత్ర.

ఏవాణి వదనరాజీవరంగస్థలంబున నలువరాణి నిచ్చలును నట్టువలు సలుపుచుండునో! ఏవాఁడు కువ్యాఖ్యా విషమూర్ఛితయగు కాళిదాస కవితాసుకన్యను దనదు సంజీవినిచేఁ దెప్పఱిల్లఁజేసి, ఒజ్జలమిన్న యని వన్నెకెక్కెనో! ఏమహాముపలు దివ్యనామామృతమును వీనులారఁ గ్రోలని యక్షరామ్యుఁ డొక్కఁడైన నీభువిని గానంబడఁడో! ఏమహితచారిత్రుని యశఃకుసుమంబుల ధరియించి దివాకర నిశాకరులు పుష్పవంతులను సార్థకనామమును బడసిరో!

ఏవిద్వదవతంసుఁడు అనన్యజన సామాన్యమగు మహామహోపాధ్యాయ బిరుదమునకు మార్గదర్శి యయ్యెనో! అట్టిచుళుకీకృత సకల శాస్త్ర జలధియగు కోలచల శ్రీమల్లినాథ సూరి వంశమున మన శ్రీనివాస కవిముఖ్యామణి విరుపాక్ష క్షేత్రమునకు సమీపమునందుండు కామాలాపురమను గ్రామమునఁ గ్రీస్తుశకము 1854-3-13 తేదీలకు సరియగు ప్రమాదీచ సంవత్సర ఫాల్గుణాసిత చతుర్దశినాఁ డుద్భవించెను. ఇతఁడు బాల్యముననే సంస్కృతభాషను జక్కఁగ నభ్యసించి, పిదప నాంగ్లేయభాషయందు దస మానైపుణ్యమును గడించి, కొంతకాలము రాజకీయోద్యోగియైయుండి, తర్వాత న్యాయవాది పరీక్షయందుత్తీర్ణుఁడై, బలారిపురవరమున న్యాయవాదిగ వఱలుచుండె. ఇతనికి నొకకూఁతురును, నలుగురు కుమారులును గలరు. మఱియు నితఁడు 1917 సం॥ ఏప్రెల్ 7 తేది దేహాళీపురమున జరిగిన విద్వత్సభ యని ప్రసిద్ధిఁగాంచిన యాంధ్రసాహిత్య పరిషత్సభ కగ్రాసనాధిపుఁడుగ నియమింపఁబడియుండె. ఇట్టుండ నేతత్కవిచంద్రుఁడు రాజవ్రణపీడితుఁడై యాంధ్ర కువలయంబు వసివాడఁగ కవిచక్రంబు లుల్లసిల్ల 1919 సం॥ జూను 23 తేది యస్తమించె.

ఇట్లు విన్నవించు,

సుజన విధేయుఁడు,

రావాడి - వెంకటరామశాస్త్రి.

శ్రీ

# శిలాదిత్యనాటకము

నాంది.

శా. శ్రీరాజింపఁగ మించునర్ఘ్యమకుటశ్రీవర్ధిలన్ జేయుఁగాఁ,
బోరామిన్ రఘువంశజాతుఁ డగుచున్ భూజాతనున్ గూడుచున్,
ధారాళంబుగఁ బ్రోచె దీనతతి నద్దైవంబు నిత్యంబు నా
శ్రీరామాభిధదైవ మియ్యుత యశశ్శ్రీసంపదామోదముల్.

సీ. భవ్యమై భాసిల్లుభాగవతం బుండ
స్తవ్యమై భారతచరిత యుండ,
శ్రావ్యమై రంజిల్లు రామాయణం బుండ
నవ్యమై బహుపురాణంబు లుండ,
దివ్యమై దీపించుదేవీచరిత లుండ
కావ్యమై హరివంశగాథ యుండ,
సేవ్యమై మునికులశ్రేష్ఠులకథ లుండ
ద్రవ్యమై భువి బృహ[illegible] యుండ.

గీ. మూలఁ బడినట్టి యీకథ యేల యనుచు
పొలుమాలక వినుఁడయ్య మేలు కలుగు
దేశచరితముఁ దెలిసినఁ దెలివి హెచ్చు
చాలు చర్విత చర్వణ మేల మీకు.

ఉ. సత్యవచోనిరూఢి బలసంపద దైవవరమ్ము గాంచుచున్
నిత్యయశోవిశాలుఁ డయి నీతివిదుం డయి మేలు గాంచె నా
దిత్యనిపుత్రుఁ డీవసుమతిన్ ఘనుఁడంచుఁ దలంచి యీశిలా
దిత్యచరిత్ర నాటకవిధిన్ రచియించితి శ్రీనివాసుఁడన్.

అనుబంధము 1.

శ్రీ

# శిలాదిత్య నాటకము.

## ప్రథమాంకము — ప్రథమరంగము.

### వాచస్పతిశర్మ - సుభగ.

(వాచస్పతి శర్మయను బ్రాహ్మణుని కుటీరము. సుభగ మూర్ఛిల్లి క్రిందపడి యుండును)

వాచస్పతిశర్మ.—(కన్నీరుగార్చుచు.)

సీ. ఇందుకళాలిక సుందరఫాలంబు
తిలకశూన్యత నెటు చెలువు గాంచు?
సకలసంపద లీనుసతిత్రాలుకనుఁగవ
యంజనత్యక్తత నమరు నెటుల?
తనయరో పీటికధావళ్యతాధర
యగునిన్ను నేఁ జూడ నగునె కనుల?
కలకంఠకంఠి కిఁ గంఠసూత్రవిహీన
గతి సంభవించెనే కాలమహిమ.

తే గీ. అంగరాగాదు లేవి శుభాంగి గనక
వాడుచుండఁగ నే నెటు జూడఁగలను
వేదశాస్త్రార్థవిదుఁ డగువిప్రవరుఁడ
వేఱువిధులను దలపెట్ట దూఱుగాదే.

తనయా! ఇంతటి నీ ...శవ్యసనం బనునయింప నావశమా? బిడ్డా! నే నేమి చేయఁగలను? బాల్యమునుండి రక్షించి బుద్ధులు గఱపి సర్వలక్షణసంపన్న

ఁయి శ్రుతశీలయుతుఁ డగువరునకు, నిశ్చిచ్చి బ్రాహ్మవివాహం బొనర్చితిని. దేశ దేశములనుండి దైవజ్ఞులను బిలిపించి వధూవరులజాతకంబు లిచ్చి గణకూటంబులు శోధించి తారాబలచంద్రబలంబులఁ జూపించి యీదాంపత్యంబున కేయపాయంబు లే దని తలంచి హిత మెంచి పెండ్లి జేయించితి. అకటకటా. నాశ్రమ యెల్లవ్యర్థం బయ్యె. నాతను వృద్ధదశలో వ్యసనంబు తప్పదయ్యె. కల కాలం బీకలికి నాయనా నాగతి యేమి యని నన్నడుగు చుండునుగదా! నే నేమని సమాధానం బగునుత్తరం బిత్తును? అయ్యో విద్యాగర్వంబున ముందు వెనుక యాలోచింపక వేదములకు వ్యాఖ్యాన మొనర్చితినిఁ గదా? అకటా యిపుడు గదా కొన్నిశ్రుతిస్మృతులకు నిజమైన యర్థంబు దెలిసెతి. బిడ్డపాపల జిడ్డు లేక వారికిఁ గలుగుదుఃఖానుభవంబుఁ గానక విద్యాబలగర్వంబున ననవద్యము లగుస్మృతులకుఁ గష్టార్థంబులు గల్పించి జనులను బాధించు చుందురు కదా వ్యాఖ్యానకర్తలు. అట్టివారిలో నే నొకృఁడ నైతిని "నైకస్య బహవస్సహపతయః" యను ఋగ్వేదశ్రుతికిని "తస్మా నైకా ద్వౌ పతీ విందతే" యనుయజుర్వేదశ్రుతికిని నే వ్యాఖ్యానంబు వ్రాయుసమయం బున నాకే యింతటికష్టానుభవంబు గలుగు నని యెఱుంగ నైతిని అకటకటా! ఆ శ్రుతులకుఁ గష్టార్థంబులుగల్పించి దురదృష్టు లగునిట్టి ముద్దుబిడ్డలపాలిమృత్యు వైతినిఁ గదా. జగ ముండునంతకు దౌర్భాగ్యులగుమగువలు నన్ను దూషించి శపింతురు గదా? అయ్యో ఆశ్రుతులకు యథార్థ మగునర్థ మిపుడు లిఖించి ప్రకటింతునా? అట్లువ్రాయుటకు స్మృతు లనేకము లున్నవి కదా? "నష్టే మృతే ప్రవ్రజితే" యనువాక్యము మనువు పలుకఁడా? "ఉద్వాహితాపియాకన్యా" యనువచనంబు నారదుఁడు పలుకఁడా? "వర శ్చే త్కులశీలాభ్యాం" యనుశాతాతపుని ప్రమాణ వచనంబు లేదా? "కులశీలవిహీనస్య" యనునుడి వశిష్ఠుఁడు పలుకఁడా? "సతు యద్యన్యజాతీయః" యను కాత్యాయన వచనంబు లేదా? కన్యాశ్రేయస్కరము లైనయిట్టివచనంబు లాశ్రుతులకు వ్యాఖ్యానంబు గఁ జేకొనక కట్టడీవచనంబుల కటికిగుండియ నై గొని వ్యాఖ్యానము వ్రాసితినిఁ గదా? ఇపుడు మార్చుదునా? మార్చెద........(అనుచునాలోచించి) ఏమి! ఇవు డటుమార్చినచో జనులు న న్నేమని నిందింతురు? పరులబిడ్డలు విధవ లయి కష్టము లనుభవించుతఱి నితనికిఁ గరుణ రా దాయె! తనబిడ్డకుఁ గష్టము సంప్రాప్తించినపుడు గదా దయఁ బూనె నని యాడుదురు గదా? ఏమి సేయుదు? ఈముద్దుబిడ్డవ్యసనంబు గనులం జూచి యెటు లోపుదు? (అనుచు బిడ్డను జేరి) తనయా! ఊఱడిల్లుము. లెమ్ము. వ్యస నమ్మునఁ బ్రయోజనమ్ము గలదా?

అనుబంధము ౨.

సుభగ —(లేచి.)

అకటకటా! తండ్రీ! శోకము సైప నోప. శరీరము దుర్భరము.

వాచస్పతిశర్మ —

ఉ. క్రూరతర శోకవారధినిఁ గూలఁగ నేటికి? నిట్టు లక్కటా!
మాతర మేమె దైవగతి మార్పఁగఁ గర్మఫలంబు ద్రిప్పఁ గా?
భూతలమందు మానవులు బుట్టుట గిట్టుట సాజమే గదా?
నూతన మిద్దియే? వలదనూనవిచారము మానుమా మదిన్.

తల్లీ! నీ విటు తల్లడిల్లుచుండిన నే నెటు సహింపఁగలను. పూర్వజన్మకర్మ ఫలానుసారంబుగ సుఖదుఃఖంబులు మానవుల నందు చుండును. వలదని ప్రోసినను నది పోవునది కాదు "అవశ్య మనుభోక్తవ్యం కృతం కర్మ ఫలాఫలం," అనునది నీవు వినవా? ప్రపంచంబున నెందఱు యువతులు వివాహితలై ప్రాగ్భాగదుష్కర్మ ఫలవశంబునఁ బతివియోగం బందరు? అది నీ వెఱుఁగవా! కాశీరా జగుదివోదాసునికూఁతురు తనదుష్కర్మఫలంబున ననేకపతులవియోగంబునఁ గుందుచు బ్రుందె ననిపద్మపురాణస్థదివ్యాదేవ్యుపాఖ్యానంబున నీవు చదువవా? ఇది నీ పూర్వకర్మఫలంబు నీ వనుభవింపక మఱెవ్వ రనుభవింతురు?

సుభగ. —తండ్రీ! పరివారలు ననుఁజూచి విధవ యని తిరస్కరించుచు నిర్భాగ్య యని దూషించుచు నీమొగముగాంచినచో నమంగళం బని నిరసించుచు నను నొప్పించు చుందురు గదా? దాని నే నెటు సహింతు? అకటకటా. నాయట్టి నిర్భాగ్యురాలిని మాననీయం బని యీయవని బ్రదుక నగునా?

సీ. బంగరుకమ్మలు ధరియించుపుణ్యంబు
గాన వయ్యెను గదా వీను లకట,
ముంగర ధరియించుముదము లే దాయెఁగా
నాసకు వసుమతి వాసి చెలఁగ,
మంగళసూత్రంబు మన్నించి పూజించు
కలిమి లే దాయెఁ గా కంఠమునకు,

రంగారు గాజులు శృంగారముగఁ దాల్చు
భాగ్యము కరములు బడయ వయ్యొ.

తే. గీ. పసుపు గంధము కుంకుమ పూసఁ గ బూసి
పెట్టు భాగ్యంబు నాకుఁ జూపట్ట దయ్యె
నకట నే నెటు బ్రదుకుదు నయ్య తండ్రి
భార మాయె శరీరము సేర మనఁగ.

తండ్రీ! నే నిఁక నీదేహమున నిలువఁజాల. నన్నుఁ గొనిపోయి పాపికూపతటాకములం దెచట నయిన ద్రోయుము నీవు ద్రోయకున్న నే నే యాపనిఁ జేసికొనియెద.

వాచస్పతిశర్మ.—తల్లీ! ఈరీతి గుండె ద్రెళ్లు మనుమాట లాడి నన్ను గలంచెదవేల? ఇట్టి దుష్ప్రాప్తి ప్రపంచంబున మఱియెవ రనుభవింపరా? వారు నీవలెఁ దెంపు జేసిరే? వల దీ దుఃఖము. ఊఱడిల్లుము. ఈజగతిలో నెందఱు మగువలు మగలు లేక మనరు?

సుభగ.—తండ్రీ! నాయంతటి దౌర్భాగ్య లెవరును లేరని నేఁ దలఁచెద.

ఉ. కూఁడరె దారలన్ మగలు కూరిమిఁ గొన్ని దినంబులైనఁ గా
పాడరె! పుత్రులన్ గనరె! భద్రసుఖంబులు గాంచి మించరే
వీడరె! యీవిధంబున నవీనవయస్కుల భామలన్! గటా!
పాడి తొలంగిరే! ధరణిఁ బాసిరె! భార్యల వార్ధిఁ ద్రోసిరే!

అనుబంధము 3.

సోయనా! ఇహపరంబులకు దూరనై యేమని నేమని యుండుదు? అయ్యో! బ్రదికి నే నేసుఖము నందవలెను. అహర్నిశలు పతివియోగానలంబునం బడి పరితపింప సాధ్యమా?

వాచస్పతిశర్మ.—తనయా! ఎందఱు తమపతివియోగానంతరము బ్రహ్మచారిణులై బ్రహ్మజిజ్ఞాసం బొనర్చుచుఁ గాలంబు గడపరు ఎందఱు దేవపూజానిరతలై భావంబునఁ దత్సేవాసుఖానందంబు బొందరు? ఆరీతి నీవు నూఱటు గలిగించు

కొని యుండుము. నీకు నాదిత్యహృదయం బుపదేశించెద. దానిచే నీకుఁ గలుగువ్యసనంబుఁ దోఁపక యుండును.

మ. తనయా! యర్యమమంత్రవేత్తలు సద్భక్తిన్ సహస్రాంశున
ర్థినిఁ బూజించినవారు నిర్వ్యసనులై దీపింతు రీక్షోణిఁ; గా
వున నీ కామహనీయమంత్రజపమున్ బోధింతుఁ; దత్సాధనన్
గనుమా యీయిట నిందుపుణ్యగతి స్వర్గంబందునిం బొందగన్.

తనయా! వలవంతచే మానసము గలఁపకు సూర్యమంత్రంబు నీ కుపదేశించెద దానిచే నాయిట నందుము పోవుదము రమ్ము.

(నిష్క్రమించిరి.)



దిద్వితీయరంగము.



కేరళపట్టణము - సారణీనదీతీరము.

సుభగ.—(సుభగ పీతాంబరము కట్టికొని మడుగుబట్ట యొడవేయుచు వచ్చి యెఱ్ఱ పూలతో సూర్యు నారాధించుటకుఁ బ్రారంభించును.)

(పూజించి లేచి నిలిచి ఆదిత్యుని దిక్కుఁజూచి చేతులు మోడించి.)

సీ. ఆదిదేవా నిన్ను నర్థి నే నర్చింతు
భాస్వర నిన్ను భావమునఁ దలఁతు,
దినకర నీకు వందనముల నొనరింతు
ప్రభాకరా నిన్నుఁ బ్రణుతిఁ జేతు,
సప్తాశ్వరథ నిన్ను సంస్తుతి యొనరింతు
లోహితా నినుఁ గొల్తుఁ బాహి యనుచు;
లోకకర్తా నిన్నుఁ దేకువ భజియింతు
పాపహర్తా నీదు రూప మెంతు.

గీ. దేవ నీ లేనిదినము దుర్దిన మటంచు
భావమున నెన్ని ప్రణమిల్లి భక్తిఁ గొలుతు
దీనురాలను బ్రోవుమా దీనరక్ష
విశ్వమంగళ జగదీశ విబుధవంద్య.

మహానుభావా! శత్రువినాశకరమై జయావహమై పరమసుఖదాయకమై సర్వమంగళమాంగళ్యమై సర్వపాపప్రణాశకమై శోకప్రశమనదాయకమై యాయుర్వృద్ధికర మైననీదివ్యమంత్రంబు నాహృద్గతవ్యసనంబు పరిహరించు నని జపించెద.

## అనుబంధము 4.

## దండకము.

శ్రీమన్మహాభాస్కరా - తప్తచామీకరాభాంగ సర్వేశ్వరా, యీశ్వరా-వ్యోమసువర్ణాశ్వబింబాంతరా, సర్వదేవాత్మకా, ఋగ్యజుస్సామవేదాత్మకా, రశ్మిమంతా, వివస్వంత, దివ్యత్సముద్యంత, హార్యశ్వ, సప్తాశ్వ. హీరా, రవీ, ద్వాదశాత్మా హరీ, వ్యోమనాథా, తమోనాశకా, పింగళా, మండలీ, పూష, హార్యశ్వ, పద్మప్రబోధా, సువర్ణాండగర్భా, సుపర్ణా, జగచ్చక్షు తేజస్వి, సారంగ, మార్తాండ నీయంశజాలంబు లోకాళి సృష్టించు - పోషించు, నాశింపఁజేయున్ గదా, బ్రహ్మవిష్ణుర్మహేశాను లీవే గదా, యింద్రవహ్న్యంతకక్రవ్యపాశిజగత్ప్రాణకాలస్త్ర్యమ్బకేశదిక్పాలకుల్ నీవె గావా, మునుల్ యక్షులున్ రాక్షసుల్ సిద్ధులున్ సాధ్యులున్ భూచరుల్ - ఖేచరుల్, పంచతత్త్వంబులున్, సర్వమున్ నీవె గాదా, మహానుభావ - దేవా, వరోన్మత్తగర్వంబునన్ మున్ను - క్రవ్యాదుఁడౌ రావణుం డెల్ల లోకంబులన్ గాసిపెట్టన్ దిటం బొప్ప రేద్రిమ్మతిన్ జంపఁ గాఁబూని, కోదండరాముండు, యుద్ధంబు సేయన్ సమర్థుండు గాకుట్టులో యుంచుఁ జిత్తంబునన్ జింతిలన్ గా, నగస్త్యుండు, ప్రత్యక్షుఁడై యేమహాదేవుధ్యానంబు బోధించె నాదిత్యహృన్నామమంత్రంబునన్ భక్తి నాదేవుఁ డీవే గదా, తమోఘ్న - హిమఘ్న, కృతఘ్నఘ్న, శత్రుఘ్న, జ్యోతిర్గణాధీశ-నాకష్టము ల్బాపి రక్షింపు మా మన్ననన్ గావుమా, యర్యమా, నీకునున్ వందనంబుల్ సమర్పింతు, నైవేద్యఁ బూజింతు, ధ్యానింతుఁ జిత్తంబునన్ దేవదేవా యిదే మ్రొక్కెదన్ మ్రొక్కెదన్ మ్రొక్కెదన్.

(సాష్టాంగనమస్కారంబు లొనర్చి.)

శ్లో. జయాయ జయభద్రాయ, హర్యశ్వాయ నమో నమః
నమో నమ స్సహస్రాంశో, ఆదిత్యాయ నమో నమః.

(అనుచు సూర్యనమస్కారములు చేయుచుండును.)

(బింబాంతర్గతుం డైన సూర్యుఁడు ప్రత్యక్షమై నిలుచును. సుభగ యచ్చెరు వంది చిచ్చవడును.)

సూర్యుఁడు.—

మత్త. బాల నీజపమాల వీడవె భామినీ ననుఁ గూడవే,
గోల భక్తిని నన్ను వేఁడవె! కుంభనోస్తులఁ బాడవే,?
జాలి తాళఁగ జాలఁ గానవె జాల మెలొకొ మానవే,
పూలపాన్పును నీవు చేరవె పూవుఁబోణిరొ కావవే.

సుధారసపూరితపరిపక్వబింబఫలాధరా ! నీమనోహరవాక్యసారంబుఁ గ్రోలి నీభక్తికిఁ సోలి నీరూపంబుఁగని తాలిమి వ్రీల జాలి తాళఁ జాలక నీరతికేళిఁ గోరి వచ్చినాఁడను. నేను సూర్యుఁడను.

సుభగ.—(నివ్వెఱగంది) లోకమాన్యా! నీయనన్య సామాన్యరూపంబుఁ గన్నులారం జూచి ధన్య నైతిని. నాప్రాగ్భాగ్య దుష్కర్మఫలం బీగడియతోఁ బటాపంచ లైపోయెనని యెన్నితి. పుణ్యపురుషా. భూలోకమానవులంబలె నింద్రియాధీనమానసుఁడవై పరభామను స్మరకేళికిఁ బిలువ నగునా ? నీచర్య విచిత్రంబుగ నున్నది. నీ వామహానుభావుఁ డగునా కాదా యనునది సందియంబుగ నున్నయది. (అనుచుఁ దలవంచికొని యుండును )

సూర్యుఁడు.—

ఉ. కోమలి నాన యేల? సుమకోమలగాత్రము దాఁచె దేల? నా
కామితముల్ ఫలింప, ననుఁ గన్నులఁ గానవదేల! బాల! నీ
నోములపంట నే ననుచు నొక్కి వచించెద నమ్మ వేల? నే
ధామనిధిన్ నిజం బిది సుధావిధు నీరతిఁ గోరి వచ్చితిన్.

ఓ రాకానిశాకరాననా! నీసందియంబు మానుము. యథార్థంబుగ నే సూర్యుఁడను. నీమంత్రమహిమ యీమహికి నన్నాకర్షించెను. నీమోహనరూపంబు నాధైర్యంబు హరించెను. నీసుందరవదనావలోకనంబున నామదిమరు మదనుఁడు చెదర్చి నాహృదయంబునఁ బదనుములుకులు గ్రుచ్చుచున్నవాఁడు. కోమలపల్లవపత్ర రదచ్ఛదనా! మదనకేళికి నద నిది. నిన్నుఁ బదలఁ జాలను. నీతావి కావిమోవి చవిరుచిఁ జూడనిమ్ము. నీయనుపమసౌందర్యాంగలావణ్య జలనిధిలో నాయనంగ పరితప్త కాయంబు మునిఁగి యోలలాడ నిమ్ము. రతిపతిచేతి శాతాశుగవ్రాతపాతంబులభీతిఁ జలించు నాచిత్తమును నీయద్వితీయ దుర్గద్వయాంతర దుర్గమస్థానంబునఁ జేర్చి రక్షింపుము.

సుభగ.— పురుషవర్యా! నీవుజగచ్చక్షు వనునదియుఁ గర్మసాక్షి వనునదియు నిజమైనచో నే ననాథ నని తెలియకుందువా? నేవివాహిత విగతధవయనునది యెఱుఁగకుందువా? అది నీవు తెలిసితివేని యిట్టిపాప కృత్యంబునకు నీవు లోనై నన్ను దింపఁ జూడఁగలవా? నీవు మాయారూప మనుజుఁడవని నే నెన్నెద. బ్రహ్మచర్యవ్రతంబుఁ బూనినఁ ననుఁబోలుమానినినిఁ జెనకుట శ్రేయము కాదు. పొమ్ము.

ఉ. భానుఁడ వీవు గావు పరభామల మోసగతిన్ హరింపఁ గా
బూనిన కామరూపుఁడవు పూషుఁడ వైనది నిక్క మేని యీ
కానివిపర్యయంబులకుఁ గారణ ముండునె! యప్రశసితం బహో
మానవభామినిన్ గలయ మాన్యుఁడు సూర్యుఁడు గోరు నేమదిన్.

కృత్రిమమానవా! నీకుహకచర్యలు నాయందు ఫలింపవు. నిర్జనప్రదేశంబిది. నీదౌర్జన్యంబు గొనసాగునని తలఁపకు. మానవులకృత్యాకృత్యంబులఁ జూచుజగచ్చక్షువు మింట నున్నవాఁడు. అతఁడు నానమ్మినదైవము (అనుచుఁ బోవ యత్నించును.)

సూర్యుఁడు.— (అడ్డుపడి.)

అనుబంధము 6.

సీ. ఎందు బోయెదు బాల సందియం బిఁక నేల
కందర్పసుఖకేళిఁ గలయువేళ!

సుభగ — కుహూకమానవ యేల యిహసుఖంబులఁ దేల
వహనకేలలఁ గాలఁ దగునె చాల,

సూర్య — మానుమా యనుమాన మానుమా నాయెడ
బూనుమా రతికేళి పువ్వుఁబోణి,

సుభగ. — మానినీమణియెడ మానమర్యాదలు
వీడఁ బాడియె నీకు వ్రీడ లేక.

సూర్య — గీ. అంగనా నిన్ను వదల ననంగునాన
సుభగ. — అంగగునె కామినులమానభంగ మిటుల?
సూర్య. — పిలిచి రిత్తఁగఁ బంపుట పెద్దఱికమె
సుభగ. — ఇట్టిపనికినిఁ బిలుతునే రట్టు కానె!

సూర్య. — అళినీలధమ్మిల్లా! నన్నుఁ బిలిచి యీరీతి యవమానఁ బఱతువని నే నెఱుంగనైతిని.

కం. కృపఁ బూని నిన్నుఁ గలయన్
దపనుండను వచ్చి పిలువఁ దన్వీ యిటులన్
విపరీతచర్యఁ బూనితె!
శపియించెద నిపుడె నాదు శక్తినిఁ గనుమా.

శాతోదరి! నిన్ను శపించెద. నాశక్తినిఁ గనుము. (అనుచు దానిమోముపై జేతులు మూడుతూరులు త్రిప్పును. సుభగ చేష్టలు దక్కి క్రిందపడును.) ఈపరమాణువిభవమధ్య యొకక్షణం బిటుల పడి పిదప లేచి కామాతుర యై నన్నుఁ గోరి వెదకును. అదివఱకు నే నిటుడాఁగి యుండెద. (అనుచు డాఁగియుండును.)

సుభగ — (లేచి నలుదిక్కులుఁ జూచి ఱిచ్చవడి) ఏమి! ఆ పురుషుఁడు సూర్యుఁ డనుటకు సందియంబు లేదు. అయ్యో! నానోములపంట నాదైవము ప్రత్యక్షమై నన్ననుగ్రహింప బలాత్కరింప మూర్ఖనై మోటుమాటలచే నామహానీయుని యభీష్టం బోటుపఱచితి. ఆ మహానుభావుం డెం దేఁగెనో? ఆ మహానీయుని పొందు నందెడు భాగ్యంబు నే గందునో కానో? ఏమి సేయుదు ......నారులు మారునిశరవారంబు సైరింపఁగలరా?

అనుబంధము 7.

సీ. కనికనాజనని తాఁ జనినకాలమున నేఁ
జనక నిలచితి నేల జగతి నిటుల,
నిలచితేఁ బో తండ్రి యెలమి వివాహంబు
సలిపె నేలొకొ నాకుఁ జెలువు మిగుల,
సలిపెను బో భర్త స్వల్పాయువయినన్ను
వంతల పాల్జేసి వదలె నేల,
వదలెఁ బో యాదిత్యహృదయంబు నాతండ్రి,
పిత మని యుపదేశ మిచ్చె నేల.

గీ. మంత్ర ముపదేశ మిచ్చినమాత్ర నేను
ఏల జపియించితిని దాని గోల నగుచు
అటుల జపియించుమాత్రాన యిటుల భానుఁ
డేల వచ్చెను నన్నేల నేలకోరె?

ఏమి సేయుదును. ఆ పురుషవరునిఁ జూచినతటినుండి నామానసంబున మారవికారంబు గలిగి నను దూరాలోచనఁ జేసి బ్రాహ్మణాచారవిచారంబు సలిపి పతివిహీన నగు ననుబోలునిర్భాగ్యకుఁ గామవికారంబు నిద్యంబని యామారసదృశాకారుని మహానుభావుని నే ధిక్కరించితి. అతనిదివ్యమహిమ యెట్టిదయో నామనస్సౌదార్ఢ్యంబు తెంచి నాచిత్తంబు చిత్తజుని క్రూరశరంబులకు బలిపెట్టెను. ఆమదన మోహనాకారునిసుందరవిగ్రహంబు నామానసం బాక్రమించెను. నాపైఁ గోపించి పాపాత్మురాలిది యని యెంచి తిరస్కరించి యదృశ్యం డయ్యెఁ గాఁబోలు. హా! హా! సుందరా. తెలిసీ తెలియక నీచెలి యొనరించినయొకచిన్నతప్పు పెద్దఁ జేసి దండింప నగునా? నిరతంబు నిను సేవించు భక్తురాలను నేను గానా! దీనురాలి మొఱ నాలింప వేల. తప్పని యొప్పినవారిని దండింపనగునా?

ఉ. కోమలి నింతగాఁ గలఁపఁ గోపమ తాపమ శాపమా యిటుల్
కాముని బాధలన్ బడుచుఁ గాయము ప్రాయము హేయమయ్యెగా

కామితదాయి వైకరుణఁ గావుము ప్రోవుము చావు మాన్పుమా
ధామనిధీ కృపన్ గనుము తాఁ తెలిఁ గోరితి నీరతిన్ మతిన్.

సుందరాకారుండు రాడయ్యె! నావికారంబు బలమయ్యె మనఁజాల. (అనుచు నేలఁ గూర్చుండును.)

సూర్యుఁడు.—(దూరమున నిలిచి (స్వగ) బాధ చెంది యనుభవించునపుడు గదా భామినులకు బుద్ధి వచ్చును నేనై పైఁబడినపుడు నన్నెంత బాధించెను? సకల వేదాంతవిద్యలలోఁ బారంగతు లైనవారికే యింద్రియనిగ్రహం బసాధ్యం బగుచుండ నిట్టియబలలా నిగ్రహించువారు. ఈ సుందరినిఁ జేరి మారుకేళినిఁ గూడియనుగ్రహించి పోయెద.

(అనుచు సరసనుజేర సుభగ దిగ్గన లేచి తలవంచికొని యుండును.)

సూర్యుఁడు.—

ఉ. ఇంతిరో నీమదిన్ గనఁగ నెక్కుడుజాలి జనించె నక్కటా
కంతునిములుకులున్ దవిలి కాయము నొవ్వఁగ సైఁపలేవు నీ
వంతనమున్ వెలిన్ బడ నమాన్యత యుంచనితల్కెడీ నేవు నే
నంతయుఁ గాంచినాఁడనుభయమ్మునకున్ మనమీకయుండుమా.

అనుబంధము 8

(కేలంది) మోహనాంగీ! భయమ్ము వలదు. నిను రక్షించువాఁడను నేను. క్షీణించినక్షత్రియకులంబు నీనుండి నిలుచును.

సుభగ.—మోహనాంగా! నామానసవృత్తి యెఱింగిన నీకు నేను పెంచ్చుగఁ దెల్పఁజాలను. సుందరా నావృత్తి నామతమువారిలో నగు బాటగును. సరివారిలో నాకుఁ దలవంపులగును. చిన్ననాఁటినుండి నన్నుఁ బోషించిన జనకునిమది కివిరుద్ధముగ నుండును కావున మహానుభావా! నీవు నామందిరంబునకు వచ్చి నాతండ్రిసమ్మతిఁ గొని నను రక్షింతువని ప్రార్థించెద.

సూర్యుఁడు.—సతీమణీ! నీతండ్రి విద్యాగర్వంబున ముందు వెనుక లారయక శ్రుతిస్మృతుల కపార్థంబు గల్పించి భూలోకమునకు నపకారంబు నేయ నూపిన వాఁడు కావున నే నతనిముఖావలోకనంబు నేయను. నీతండ్రి భయంబు నీ కేల. నీగర్భంబున లోకమాన్యుఁ డైనరాజన్యుఁడును పుణ్యధన్య యైనకన్య

యొకతెయుఁ గలుగుదురు. వారినిఁ గొన్నిదినంబులు నేఁ గాపాడెద. నీ కేసందియము వలదు. నీకు మానినీత్వము చెడదు. కన్యాత్వము పోదు

(అనుచుఁ బిలిచికొని పోవును.



## తృతీయరంగము.



వాచస్పతి గృహము.

సుభగ - వాచస్పతి.

సుభగ.—సీ. మిన్నయి సన్నగా నున్న నా లేఁగౌను
గరువంపుగరిమమై బరఁగె నేఁడు,
రాగోరురుచులచే రాజిల్లుచను మొనల్
నీలకాంతి వహించి నెగడె నేఁడు,
చిగురులజిగికాంతిఁ జేలువుఁ గాంచినమోము
వెల్లెలఁబాఱుచు వెలయు నేఁడు,
మించె నిట్టూర్పు జనించె నురుశ్రాంతి
కొంచెపుటూరు గాన్పించె నేఁడు.

గీ. నడలకును మందభావంబు లడరె నేఁడు
యొడలకాంతికి జిగి హెచ్చి యొప్పె నేఁడు
కడుపు బరువయి కాన్పించె; ఘనతఁ గాంచి
దైవమా యేమి తెలుపుదుఁ దండ్రి కిపుడు.

అక్కటా! నే నేమిసేయుదు చెడినయిల్లా లయి పుట్టినిల్లు చేరి యాచూలాలితనంబు వహించిన నన్నుఁ జూచి నాతండ్రి యెంతనిందించునో? ఎంతగా దండించునో? మహనీయకులంబునఁ బుట్టి చెట్టలానరించి యట్టుఁ దెచ్చె నీగట్టువాయి దిట్ట యని తోడిచేడియలు నన్నెంతగాఁ దిట్టుదురో? కన్నయ్య నన్నెంత గాఱించునో? చిన్నయ్యలు నన్నెన్నివిధముల హింసింతురో? అయ్యో! కటికలచేఁ గల్పింపఁ

బడినశాస్త్రికట్టడములు దెలిసియు కులాచారముల నెఱింగియు కామాతురత నేమంబు మాని యామహనీయునితో రమించి యిన్నికష్టములుఁ దెచ్చికొంటిని. ఇపు డేమని కొనిన నేమి ప్రయోజనము? నాయనకు నను నే నేమని నామోము జూపుదు? ఆతని రాకకు మున్నె నేను ప్రాణముపైఁ బరాకుమాని యేసీరాకర మైననుఁ జేరెద. ఇచట నుండఁజాల. (అనుచు వెళ్లును. లేచును. మరల నాలోచన నభినయించుచు) ఏమీ ! ఆమహనీయతేజస్వి నాకేమి తెలిపెను? పీడించినక్షత్రియకులంబు నుద్ధరించు సుతుఁడు నాగర్భమున నుద్భవించునని పలికెను గదా ! అట్టిసుతుని మోముఁ జూడక నేను ప్రాణంబులు బాసిన నేమి ప్రయోజనము? నే నొనరించినది నిజంబుగఁ బాపకార్యంబై యుండినచో దానికిని జేకగఁ బ్రాణహత్యాపాతకం బొకటియు భ్రూణహత్యాపాపం బొకటియు నాచరింప నేల? కులాచారమునుబట్టి నన్ను వెలివేయుదు రనుభయము కదా? నే నిచటు నుండక వేఱుదేశంబునకుఁ బోయిన నన్నడుగువా రెవరు? ప్రాణంబులు ద్యజింప నోప శిశుహత్య గావింప నోప. వచ్చినది రానిమ్ము. తండ్రి దండింప నిమ్ము. లోకులు దిట్ట నిమ్ము. తోడిచేడియలు హేళ కావింపనిమ్ము.

(వాచస్పతి శర్మ ప్రవేశము.

వాచస్పతి.—(ప్రవేశించుచు) ఆకుంకలా నాతో వేదార్థవిచారంబు సేయువారు? సకలరాజ్యమ్ములు గ్రుమ్మరించి సకలశాస్త్రంబులు తలక్రిందుగఁ జదివి నిఖిలాగమవేత్తనై యఖిలవిద్యలలో నసదృశుండని భట్టాచార్యబిరుదు వహించి మించి వేదవ్యాఖ్యానకర్తనై గౌరవ మందిననాతో రెండక్కరములు నేర్చి పండితుల మని గర్వించువారా వాదింతురు. ఏమి ఈకలికాలమహిమ ? "యస్మైకాగం రశనాంద్వయోర్యూపయోః పరివ్యయతి తస్మాన్నైకా ద్వౌపతీ విందతే" ఒకపగ్గమును రెండుయూపములకు నేలాగునఁ గట్టఁ గూడదో యారీతి నొకస్త్రీకి నిరువురు పతులు కూడదని స్పష్టముగ నుండ మూర్ఖులు పతు లిరువు రేక కాలంబున నుండఁ గూడదని విపరీతార్థంబు గల్పించి నాతో వాదించిన నేను వారికి నోడుదునా? వారితలతిక్క విడిపించితిని. భోజనానంతరము మరలఁ బోయి వాదించెద.........ఏమీ ! నాయనుంగుఁగూతురు నే వచ్చునంతలోఁ బాదప్రక్షాళనకు నీరు దెచ్చి యిచ్చు చుండెనుగదా? నేడేల రాదయ్యో! పోయి విచారించెద.

(పోయి సుభగంజూచి యచ్చెరువంది.)

ముద్దుకూతురా ! ఏమి యీవిచారము నిన్నెవ రేమియనిరి? చింతిల్లెద వేల?

మోము వంచితి వేల? తల యెత్తుము. (అనుమునఁ దలయెత్తి) కూతురా. ఏమి. యీ విపరీతచర్యలు. నీవిధంబు విధివిపర్యయంబు గనున్నది. ఈగర్భచిహ్నాలు నీ కెట్లు గలిగెను. తరతరములుగ ననేకయాగంబు లొనరించి సోమయాజులయింటిపేరం బని పూజ్యతఁ గనిన కులంబున కే కళంకంబు దెచ్చితివి సకలవేదార్థనిధి యనునా పెద్దఱిక మాఱడిపుచ్చితివి. నాఖ్యాతి పీటఁబుచ్చితివి నీ కెట్టు లీగర్భంబు గలిగెను? నిజము పలుకుము.

సుభగ.—(భయ మందుచు) తండ్రీ! ప్రతిదినము ప్రాతఃకాలము సారణీనదికిం బోయి స్నానమాడి నీచే నుపదేశింపఁబడిన యాదిత్యహృదయమంత్రంబు పఠించుచుంటినిఁగదా అదేరీతిగ నీదినము నైత మాదినకరుమంత్రంబు పఠింపఁ నామహానీయుఁడు ప్రత్యక్షుఁడై వలదన్నను నాతో రమించెను. తత్ఫలంబిది.

వాచస్పతి.—(అద్భుతముద్భుతము) లోకములో మఱియేవిచిత్రంబులు గలుగునో! పూర్వము కుంతిభోజుని కూతురుకుంతికి సూర్యుఁడు ప్రత్యక్షమై యాయింతితో రమింపఁ గర్ణుఁడు పుట్టెనని గాథ యున్నది అనుభవము పైనఁ జూడ నది నిజమని తోఁచెడు. ముందు జరుగఁ దగినవిధాన మెద్ది? పుత్రీ! ఆమహానీయుఁడు నీసరసఁ జేరినతఱి నాతండ్రిసమ్మతిఁ బడయుమని వేఁడలేదా?

సుభగ—జనకా! మ్రొక్కి వేఁడితిని. అతఁ డియ్యకొనఁ డయ్యె! రమ్మని బలాత్కరించితని. "నీ తండ్రి వేదముల కపార్థంబు వ్రాసినవాఁడు కావున నతని మోము చూడనని" భానుఁడు వచించెను.

వాచస్పతి—ఏమి! వేదముల కపార్థము వ్రాసినానని సూర్యుఁడాడెనా? నిజమా? అటులైన నావ్యాఖ్యానం బంత యుఁ గాల్చివేసెద (ఆలోచించి) తనయా! సరివారిలో నగుబాటుగు నాగర్భంబు ధరించి నాయింట నుంటఁ మంచి గాదు. నీవు బలభిత్పురంబునకుఁ బోయి యుండుము. నీ కేలోటుంత లేనటుల ద్రవ్యము నంపుచుండెద. అప్పుడప్పుడు నేనును వచ్చి చూచుచుండెద.

సుభగ.—తండ్రీ! నీయానతిరీతి వర్తించెద. ఘనంబైన సూర్యవంశక్షత్రియకులం బుద్ధరించుకుమారుఁడును లోకమాన్య యగుకన్యయు నాగర్భంబునఁ బుట్టుదురని యామహానీయుఁడు వచించెను.

వాచస్పతి.—దైవవిచిత్రంబిది. చింతించినఁ బ్రయోజనమ్ము లేదు. ఈదినంబుననే నీవు బలభిత్పురంబుఁ జేరుము. రమ్ము. పంపెదను.

(నిష్క్రమణము.)



శ్రీ

# శిలాదిత్య నాటకము

## ద్వితీయాంకము — ప్రథమరంగము.

బలభిపురము.

పాఠశాల.

శ్యాముడు.—రండిరా! ఇచ్చట నే గూర్చొని హాయిగ మాటలాడుచుందము. నేఁడయ్యవారింటిలో వారబ్బది పిండమఁట. నన్నే బడి చూచుకొమ్మని చెప్పినాడు

లులాయుడు.—శ్యామా! మాయయ్యవారికిటులనే మున్నూటయరవై దినములు అబ్బలగారిపిండా లుంటే బాగాయుండెను.

మహిషుఁడు—ఒకయబ్బకు శ్రాద్ధము పెట్టునంతలో యజ్ఞ మగుచున్నది. మున్నూటాయరవైయబ్బలకు శ్రాద్ధము లెటు పెట్టవలెను?

వృషభుడు.—ఒకనికి ఒకయబ్బయుండును గాని అంద రబ్బలుందురా? ఏమిమాటలివి,

శ్యాము.—చాలు. పిండాలమాట లేల. మాయయ్యవారికి వీనిమీద ప్రాణము. మేమర్థమడిగితే విచ్చి చెప్పఁడు. విఁగవలారా. మీకేల యీయధికప్రసంగమంటాడు వాఁడడిగితే యెంతసేపైనను వర్ణించి వర్ణించి చెప్పతాడు.

లులాయుడు.—దానికిఁ గారణమున్నది. నీకేమి తెలుసును.

మహిషుడు.—నే నప్పుడె యూహించినాను లే.

వృషభుడు.—ఇచట నూహింపనివా రెవరు? మాయయ్యగారికి భార్యలేదు.

శ్యాముడు.—సరె! వీనితల్లికి మగఁడు లేదు.

ఆదిత్యుడు.—ఓరీ! దుర్మార్గులారా! ఏమిటేమనెదరు. హెచ్చరిక. నే నూరక యుండువాఁడ నని క్రొవ్వి మాటలాడకుఁడి.

లులాయుఁడు — కన్నది యొకర్తె పెంచినది యింకొకర్తె యనునది నిజమయ్యె. ఏమిరా! ఆదిత్యా! తలకొట్యా! నిక్కి నిక్కి మాటాడెదవు. నీతల్లికి మగఁడున్నవాఁడా! అట్లయిన నీతండ్రిపేరేమి?

ఆదిత్యుఁడు —(ఊరక యుండును)

మహిషుఁడు — అజ్ఞాతకులగోత్రులకుఁ దండ్రి యెవఁడు? తాతయెవఁడు? పాపము వాని నేల యీమాట యడిగెదవు? తల్లిదోషానికి వాఁడేమి చేయును?

లులాయుఁడు. — వీఁడు గోళకుఁడని నాకుఁ దోఁచెడు. తా దేని తండ్రిపేరుఁ జెప్పకుండునా?

వృషభుఁడు. — ఎవఁడో యగస్త్యభ్రాత వీనితండ్రిగా నుండును. వీని కేమి తెలుసును? తండ్రి లేనిదె పుట్టియుండఁడుగదా?

మహిషుఁడు. — నిజము? నీమాటలు నిజము? ఆడుదాని కొకఁడుగ వాఁడు మొగుఁడై యుండనిచో కొడుకెటుపుట్టును? స్త్రీలకు భర్తలు పలువిధాల నుందురు భర్త యొకఁడు. ఉపభర్త యొకఁడు ఉపభర్తలలో శాశ్వతోపభర్త యొకఁడు తాత్కాలికోపభర్త యొకఁడు ఇటులుండుటచేఁ గావున నందులో నెవనిని వీఁడు తనతండ్రిగా ననుకొనును?

శ్యాముఁడు — ఎట్టి యుపభర్త లుండనీ బొట్టుకట్టిన భర్తయొకఁ డుండును గదా? ఎటులైనను పుట్టియుండగా నీసుతుఁడు తనతల్లి నెవఁడు పెండ్లిచేసికొని యుండునో వానిపేరే తనతండ్రిపేరని చెప్పవలెను.

మహిషుఁడు — ఏమో తెలిసినవానినే చెప్పితిని వివాహము చేసికొనినభర్త లేక యున్న నేమి చేయవలెను?

శ్యాముఁడు — బుద్ధి లేనివాఁడా! వృథా వెనుకకు పోతువు గదా. చదివినది జ్ఞప్తిలో నుంచుకొనలేవు ఆయమ్మ పుట్టినతరువాత మగఁ డేర్పడును.

లులాయుఁడు. — ఏమో క్రొత్తశాస్త్రముఁ గని పెట్టితివి. పుట్టినపుడె స్త్రీకి మగఁ డేర్పడినచో మిత్రవారండలు వ్యభిచారభర్త లేరా? అటులయినఁ బ్రపంచములో స్త్రీలందరు వ్యభిచారిణు లగుదురు గదా? మేమందఱము ముండకొడుకు లగుదుముగదా? ఈమాట నే నెన్నటికి నొప్పను.

శ్వానుఁడు.—నీ వొప్పిన నేమి యొప్పకున్న నేమి. శాస్త్రము చూపి నీయబ్బ మెప్పించెదను. అది యెటు లయినది తెలిపెద వినుము. "సోమః ప్రథమో వివిదే" యని శ్రుతి యున్నది కావున భామలకు చంద్రుఁడు మగఁడు "గంధర్వో వివిద ఉత్తరః" యని యున్నది. కావున రెండవమగఁడు గంధర్వుఁడు. "తృతీయో అగ్నిష్టే పతిః" మూఁడవభర్త యగ్ని. "తురీయస్తే మనుష్యజాః" నాల్గవవాఁడు మనుజుఁ డనియున్నది కావున కాంతలకు పుట్టినపుడె మగఁ డుండును.

లులాయుఁడు.—అటు లయిన వీఁడు సోమునికొడు కుండవచ్చును. బుధుఁడువీఁడు.

మహిషుఁడు,—కాదు. కాదు. గంధర్వునిపుత్రుఁడు.

వృషభుఁడు.—కాదురా! వీఁ డగ్నిపుత్రుఁడు. తేజస్సు బాగుగ నున్నది

శ్వానుఁడు.—ఇంతయె కాదు. పుత్రులు బుట్టుటకు మఱియొకకారణ మిటీవల కలిగినది. ఏదో హనుమునిగాలి యున్నదఁట. ఆగాలి సోకిన కాంతలు గర్భము దాల్తురఁట,

లులాయుఁడు.—అవును నేను విన్నాను. మంత్రగర్భ మొకటి కూడ నున్నది. అటులనే ఆశ్వత్థప్రదక్షిణగర్భము అదే రీతిగా నే నుండుదిరిగినగర్భము. నాగప్పగర్భ మిదేరీతి.

మహిషుఁడు.—పోరా! మంత్రములతో మామిడికాయలు రాలునా? పిచ్చికూఁత లివి. మీమాటలే నిజమైన బురుషగర్భ మేల నిజము కాఁగూడదు?

శ్వానుఁడు—ఏమిరా! వీఁడు మే మెన్నిమాట లాడినను బెల్లము కొట్టినఱాయివలె నూరక తలవంచికొని కూర్చున్నవాఁడు. వానితండ్రీ యెవఁడైతే మనకు వచ్చినదెమి?

లులాయుఁడు.—ఏమి యటుమాట లాడెదవు వీనితండ్రి యెవరైనది తెలిసినచో నాకించుక కార్య మున్నది.

వృషభుఁడు.—వానితో నీ కేమి కార్యము?

లులాయుఁడు.—వీనితండ్రి బ్రాహ్మణుఁ డైనయెడల వీనిచెల్లెలను నేను వివాహము చేసికొందును.

శ్యాముఁడు.—అటు లయిన నీయబ్బనే జేసికొననా? అట్టిపిల్లను నీకు విడిచిపెట్టెద ననుకొంటివా? ఎన్నటికిని వదలను.

వృషభుఁడు—అందరు చేసికొన నిశ్చయించువారె. రెండువేలవరహాలు కన్యాశుల్క మడిగినచో మీ రందరు ఘట్టని గుటకలు మ్రింగుచుఁ బండుకొనవలసినదె కదా. ఎంతయడిగిన నిచ్చి నేఁ జేసికొందును.

శ్యాముఁడు.—నిజముర! నిజము! బోడముండలకు భరణార్థమువలె నీతండ్రి నీకు ధనము వదలి పోయినాడు. కావున మిన్ను మన్ను దెలియక దానిని వ్రయముగ చెదవు. దేహశ్రమచే నీవే యార్జింతు వేని ఈరీతి దుర్వినియోగము చేయుదువా?

(మహామహోపాధ్యాయ పంచాననలు ప్రవేశము.)

ఉపాధ్యాయులు.—ఏమిరా! శ్యామా! మీమివెనుకటి పాఠములు చదువుకొంటిరా?

శ్యాముడు.—పూర్తిగఁ జదివితిమి. మాఘము చక్కఁగ వెళ్లికొనెను మేఘము నైత మంతకష్టపెట్టలేదు. దానియబ్బలకిమెపు ముండా నైషధ మొకటిచదివినను యర్థము కాలేదు. ఇనుపగుగ్గిళ్లు పొండి.

ఉపా—నిజము. అది నారికేళపాకము.

లులాయుడు.—నారికేళపాక మైతే నేను చక్కఁగ నేర్చుకొనుచుంటిని. అది విధవపాకము. పాషాణము.

ఉపా.—ఓరీ! విధవా! అటు లనకు. పెద్దవిద్వాంసుఁ డగు శ్రీహర్షరాజుగారిచేఁ జేయంబడినది. కష్టసాధ్యము కావుననె "నైషధం విద్వదౌషధం" అని పండితు లాడుదురు. అట్టికష్టార్థము సాధించునపుడుగదా పండితున కానందము గలుగును.

వృషభుడు.—పండితుల కేరీతిగ నుండునొా గాని ఈపుస్తకము చేతఁబట్టినమాత్రము నాకు దప్పి యయినను లేచును. నిద్ర యయినను వచ్చును. పిచ్చియయినను బట్టును. తలనొప్పి యయినను లేచును.

ఉపా.—తలనొప్పి యంటె జ్ఞప్తికి వచ్చెను. నేడు శ్రాద్ధ మొనరించితి. అకాల భోజన మాయెను. కావున తలనొప్పి లేచినది. మీమియిండ్లకు బోయి రేపు రండు. నేఁ బోయి శయనించెద. (వెళ్లును.)

శ్యాముఁడు — బాగా నిదురపోండి స్వామి! పోయి వచ్చెదము ఓరిగోళకా! యింటికిఁ బొమ్ము.

లులాయుఁడు — ఓరీ! సోమపుత్రా యింటికిఁ బొమ్ము

వృషభుఁడు. — ఓరీ! గంధర్వా! మందిరంబునకు వెళ్లుము.

మహిషుఁడు — ఓరీ! అగ్నిసుతా! గృహంబునకు బొమ్ము.

ఆదిత్యుఁడు — (కన్నీరు గార్చుచుఁ బోవును)

(నిష్క్రమింతురు.)



## ద్వితీయరంగము.



సుభగగృహము.

సుభగ - నవమాలిక - ఆదిత్యుఁడు - సూర్యుఁడు.

సుభగ — (నవమాలికను జూచి) తనయా! ఆదిత్యుఁడేల రాక తడసి యుండును? తోడిపిల్లవాండ్రతోఁగూడి యాటపాటల మైమఱచి యుండునా? అయ్యో! శిక్షించునట్టి మగవాఁడు దక్షత లేనిచో పిల్లలు చెడుదురు గదా? దినదిన మిది వరకే యమ్మా యని వచ్చుచుండెను నేఁడేల రాఁడాయెను.

ఉ. భానుఁడు గ్రుంకువేళ యయె బాలుఁడు రాఁడయె నేమి పాపమో
పూనుచు దుష్టమిత్రులను బొందుచు గుట్టలు చెట్లు లెక్కెనో
కాని స్త్రైణగుల స్జముచుఁ గొరియలన్ బశి స్రుక్కి పోలెనో,
యే నెఱిలేతలంబునకు నేగుచు నారయు నెందు నిల్చెనో,

(అనుచుఁ జింతించుచుండును.)

నవమాలిక. — అమ్మా! నాయన్నయ్యను గా నేల జింతిల్లెదవు వాఁడు దుర్మార్గులతోఁ జేరునా? అటుచేరినను దుర్మార్గులను సన్మార్గప్రవర్తనకు దెచ్చును గాని తాను దుర్మార్గవృత్తికి లోబడునా?

కం. జననీ వ్యసనము మానుమ
చను నే యీచింత నీకుఁ? జయ్యన వచ్చెన్
మనయాదిత్యుం డిప్పుడె
గనుమా యీయాటను మేలు గనుమా తల్లీ.

తల్లి వల దీవ్యసనము అయ్యవారు బడి విడచి యుండఁడు కావుననె నా యన్నయ్య రా నాలస్య మైనది

(ఆదిత్యుఁడు ప్రవేశించును)

సుభగ.—నాయనా! ఆదిత్యా. వచ్చితివా! (అనుచు కౌఁగిలించుకొనును) నాయనా! నే డేల బడినుండి యాలస్యముగ వచ్చితివి?

ఆదిత్యుడు —(ఊరక యుండును)

నవమాలిక.—అన్నా! ఏమి మౌనము వహించితివి. ఈవిపరీతచర్య నీ కెన్నఁడలవాటాయెను? మనతల్లి మాటలాడించినప్పుడు బదులు చెప్పక యూరకున్నావు. నీవు బడినుండి రా లేదని దుఃఖించి మరల నీవు వచ్చినది గని సంతసించి పలుకరించుతల్లితో మాటలాడక యుండఁ గారణ మేమి? అయ్యవారు నిన్ను దండించిరా? మఱియెవరయినను నేమయిన ననిరా? మాటలాడుము.

(ఆదిత్యుఁ డూరకయుండును.)

సుభగ —(ఆదిత్యుని చెయ్యిబట్టుకొని)

ఉ. బాలుఁడ వేమి పాపమిది పల్కవు ముద్దులు చిల్కపల్కులన్,
జాలుర ముద్దుకట్టి కనఁ జాలను కారణ మేమి వంతకున్,
మేలగు నేర మౌనము తమిన్ ఘనఁ గోరితె నాకు దెల్పుమా,
జాలికి నేమి కారణము చయ్యనఁ దీర్తును సాధ్యమైనచో.

తనయా! నీవీరీతి మౌనమూని యుండుట నేఁగని యోర్వఁజాల. నీవ్యసనంబునకుఁ గారణంబు నాకుఁ దెల్పుము సాధ్య మైనచో దాని నేఁ దీర్తును. నాయనా మాటలాడుము.

ఆదిత్యుఁడు.—తల్లీ! నే నేమని చెలువుదును. నేఁ డుపాధ్యాయులు బడికిరాను దడసిరి. అక్కాలంబున నాతోడిబాలురు నన్నుఁ బలువిధంబుల నూనాడిరి. నా చింతకుఁ గారణం బదియ.

సుభగ.—నిన్ను వారేమని నొప్పించిరి?

ఆదిత్యుఁడు.—అమ్మా! "నీతండ్రి పేరేమని యడిగిరి" దానికి నే నూరకయుంటిని.

సుభగ.—పిదప వారేమనిరి?

ఆదిత్యుడు—ఒకఁడు గోళకు డని పలికెను ఒకఁడు పేఁడుసోమపుత్రుఁ డనెను. మఱి యొకఁడు పేఁడు గాంధర్వుఁ డనెను. ఇటులనే పలువురు పలువిధముల నన్ను నూనాడఁ బలికిరి.

సుభగ.—నాయనా! దుర్మార్గులేమి పలికినను నీకు వచ్చినకుం దేమి? వారిమాటలు సరకుసేయకు. ఊరక యుండుము నిన్నిటు లికముందు మాటలాడనటుల పిల్లవాండ్రను శిక్షింప నీయుపాధ్యాయులకుఁ దెలిపెద.

ఆదిత్యుఁడు.—తల్లీ! ఈమాటలతోఁ బ్రయోజనములేదు. ఉపాధ్యాయులతోఁ జెప్పి పిల్లవాండ్రకు శిక్ష కలిగించుటకంటెను నాతండ్రి యెవ రయినది తెలుపుట సులభముకాదా? నే నిపు డడిగెద. నాతండ్రి యెవరు? అతని పేరేమి?

సుభగ.—(హా యని చింతించుచుఁ గూర్చుండును.)

ఆదిత్యుడు.—అమ్మా! ఏమి యిది. ఱిచ్చపడి కూర్చుంటివి? కారణం బేమి? నా ప్రశ్నలో దప్పేమయినను గలదా? తనయుఁడు తనతండ్రిసమాచారంబు దెలియఁ గోరుట దప్పా?

అనుబంధము ౪.

శా. అమ్మా! చింతల నేల! తెల్పుమ మదీయం బైనజన్మాదివృ,
త్తమ్ముల్ వింటిని నేను దీనిపలనన్ దప్పేమియున్ లేదు గో,
త్రమ్ముల్ బాత్రత నెల్లనే నెఱిఁగి నిందల్ బాయుటల్ దప్పె హీ
నమ్మే దండ్రిచరిత్ర పుత్రుఁడు వినన్ దల్లీ వడిన్ బల్కుమా.

తల్లీ! తండ్రికులగోత్రములు దెలియనితనయుని జన్మము వ్యర్థము కాదా?

నవమాలిక.—అన్నా! మనతల్లి మానసమునకు సంకటకరమైన మాట లాడ నేల! ఇది మనకు శ్రేయమా? వలదీమాట లుడుగుము.

ఆదిత్యుఁడు.—నవమాలికా! నామాటల కంతరాయంబుఁ బలుకకు నాతండ్రివార్త నేఁడు తెలిసికొనక తప్ప నని దృఢసంకల్పుఁడ నైవచ్చినాఁడను ఈదినంబున నైన రేమి నన్ననినను సంకల్పభంగమునకు నే నోపను. (సుభగనుజూచి) తల్లీ! నాతండ్రివార్త నీవు నాకీదినము తెల్పక తప్పదు ఆలస్యంబు వలదు.

సుభగ.—(కన్నీరు కార్చుచు) తనయా! అది దేవరహస్యంబు గావునఁ దెలుప సాధ్యంబు గాదు.

ఆదిత్యుఁడు.—తల్లీ! దానిని దెలుప సాధ్యము కాదని నేనిపుడు నీప్రాణంబులు దీని నాప్రాణంబులఁ బాసెద. నిస్సందేహ మిది.

నవమాలిక—అన్నా! నీ కేమి పిచ్చిపట్టెనా?

అనుబంధము 10.

ఆదిత్యుఁడు.—నిజము పిచ్చిపట్టినది.

(సుభగంజూచి.)

తల్లీ! ఎటు నిర్ధారించితివి?

సుభగ.—(లేచి నిలచి) తనయా! ఈలోకంబునం బట్టి కష్టము లనుభవించుట కంటెను నీచేత మరణంబు మేలుగదా? దేవరహస్యంబు వెలివేయుటకన్నను జావు మేలు గావున నేఁ జావఁ గోరెద. అయిన నింపక నిలుపుము. నన్నే లుదైవంబును స్మరించిన పిదప నను హింసింపుము (తలవోడ్చికొని)

అనుబంధము 11.

సీ. వందన మొనరింతు వందారుమందార
బృందసన్నిభకర బృందమణికి,
దండంబు లొనరింతు చండకరాఖండ
మండితత్రైలోక్య మండలునకు,

కేలు మోడ్చెద గిలికీలాసహస్రాంశు
జాలాంతరితభూవిశాలునకును,
భజియింతు నిజపాదరజము సోకినమాత్ర
త్రిజగాళివ్రజినాళి దెంచుఘృణికి.

గీ. పదములం బడి యొదవునాపదలు వీడ
వదిల మని వేఁడెదను నిన్ను మృదులవిదిత
పదములను గూర్చి దేవ నీపదముఁ జేర్చి
సదయతను నన్ను గావుమా సదయహృదయ.

(అనుచు నమస్కరించి లేవబోవునంతలో సూర్యుఁడెదుట నిలచియుండును.)

(ఆశ్చపడి) మహానుభావా! దీనురాలిపై నీదయదైవార నీదినము నాసన్నిధికి దయచేసితివి. మోహనశరీరా! ఈభువి నాయునికి బహుకష్టతమంబై యున్నది. నీ ముద్దుకుమారుఁడు మూర్ఖుఁడై నేటిదినము నాదుశిరము ముక్కుడింపఁ జేసెను. ఇఁక నే నుండఁ జాలను. ఈకుసుమకోమలగాత్రి యీవసుమతి నెటుల మర్యాదగ మనునో యనుచింత దప్ప మరి నాకే చింతయును లేదు.

అనుబంధము 12.

సూర్యుఁడు.—

మోహనాంగీ! నీవ్యసనమ్ము మానుము. నీవు చిరజీవితవై యీధర నిఁకఁ గొన్నిదినంబులు మని యుండుము. (ఆదిత్యునిం జూచి) ఆదిత్యా నీహృదయంబు నాకు విదిత మయ్యె. నేను సూర్యుఁడను. నీతండ్రిని. దేవరహస్యం బిది కావున దీనిని నీవు వెలివేయక ఇఁక నీ కనునయము శ్యాకస మొనర్చి చేసి నామాట వినుము. ఇదిగో యీసాలగ్రామము. దీనిని గొని నీభువి 'శిలాదిత్యుఁ డని' పేరందుము. దీని నేమఱకుము ఎవఁడయిన నిన్నపహాస్యబు చేయంబూనినచో వానిని దీనిచే నంటుము. నీ కిబలభిపురరాజ్యం బింతలో లభించును. చాలకాలంబు శత్రుంజియుఁ డవై నీవు రాజ్యమేలి నీతల్లిని నేఁడు దండించినదోషకారణంబున నీకు యుద్ధంబున మరణంబు సంభవించును. నీసంతతివారు క్షీణించినక్షత్రియకులవంశోద్ధారకు లయి మించెదరు. నీవు రాజ్యము చేయుకాలమున మరల నొకతూరి నీకుఁ బ్రత్యక్షుఁడన య్యెద. (నవమాలికంజూచి) తనయా! నీవు వినయసంపన్నవు. నీతల్లికి విధేయవై

ముని యుండుము. నీవొకరాజభార్యవై ప్రసిద్ధి కెక్కుదువు. (సుభగనుఁజూచి) మోహనాంగీ! నీవ్యసనంబు మానుము. నేఁ బోయి వచ్చెద.

సుభగ.—సుందరా! నే నెన్ని దినంబులు నీవియోగంబునఁ గుందుచు నీభువి నుండుదు?

సూర్యుఁడు.—మోహనాంగీ! ఈచిఱుతలు స్వతంత్రులై సుఖముగ నుండునది కనులారం జూచి పిదప ననుఁగలయుము (ఆదిత్యునిఁజూచి) శిలాదిత్యా! నేఁ బోయి వచ్చెద.

శిలాదిత్య.—తండ్రీ!

అనుబంధము 13.

చం. హృదయవిశల్యమై కలఁచుహీనతఁ బాపినదైవ మీవ నీ
సదయత నెన్న నెవ్వరికి శక్యము తండ్రి విచారమగ్నుఁలై
మదిని వివేకము న్వదలి మాతను నొవ్వఁగఁ బల్కినట్టి కీ
డొదవెను నాకు నేనెటుల నోపుదుఁ దెల్పుమ యోకృపామతీ

(అనుచునమస్కరించును.)

సూర్యుఁడు—శిలాదిత్యా! చింతిల్లకు కొన్నిదినంబులు నీక్షేమచింతను నేఁ జేయుచుండెద. వెఱవకుము. ఏకార్యంబునను ధైర్యశాలివై క్షత్రియపౌరుషంబు నెఱపుచుండుము. నేఁ బోయివచ్చెద.

(నిష్క్రమము.)



తృతీయరంగము.



పాఠశాల.

శ్యాముఁడు.—మిత్రులారా! నేఁ డుపాధ్యాయుఁడు మనపాలియముఁడై వచ్చును. నిన్నటియాట నేఁ డారాటమై పరిణమించును. నేఁ డుపాధ్యాయులయింట వానితల్లి తద్దినమైనచో బాగుగనుండెను.

లలాయుఁడు.—తల్లి ఱాయివలె నున్నది. పాడుముండ. నేఁడు చావగూడదా? చస్తె పదునాలుగుదినములు మనకు హాయిగ నుండునుగదా!

**మహిషుఁడు.**—నేఁడు నేను వచ్చునపు డయ్యవారింటిపైన వచ్చితిని. వెలుపట దాని నిలచి యుండెను. అయ్యవా రేమిచేయుచున్నారని దాని నడిగితిని వైద్యునితో మాటలాడుచున్నాఁడని పలికెను. ఇంచుక యాలస్యముగ వచ్చును గాఁబోలు.

**వృషభుఁడు.**—ఎవఁడురా! యావైద్యుఁడు? లోవైపున ధనమిచ్చి యుపాధ్యాయునకు రోగము హెచ్చులాగున మందిప్పింతము.

(శిలాదిత్యుఁడు ప్రవేశించును.)

**శ్యాముఁడు.**— వచ్చెరా! గోళకుఁడు.

**లులాయుఁడు**—సోమపుత్రుని గోళకుఁడనిన వానికిఁ గోపమువచ్చును.

**మహిషుఁడు**—ఛీ! ఛీ! ఏమి మాట లాడెదరు. ఒకనికిఁబుట్టి మఱియొకని పేరు చెప్పు దుర్మార్గుఁడు వీఁడు కాఁడు. వీఁడు గంధర్వుని పుత్రుఁడు.

**వృషభుఁడు.**—పాపము. అగ్నిపుత్రుని గంధర్వపుత్రుఁడనియు సోమపుత్రుఁడనియుఁ బలుకుట పాడి కాదు. అటు పిలువకుఁడి.

**శ్యాముఁడు.**—ఈవిధవ లుండి యెవరికొడుకు వీ డైనది జూచిరి కాఁబోలు? కుంకలు జంకు లేక మాటలాడెదరు. అన్నియు పుట్టుకకు లే గాలి సర్వాంతర్యామి యని పెద్దలు పలికెదరు. కావున హనుమని గాలికిఁ బుట్టెనని చెప్పిన నమ్మ వచ్చును.

శిలాదిత్య:—ఓరీ: దుష్టాత్ములారా: మీరు క్రొవ్వి మాటలాడుచున్నవారు హెచ్చరిక.

లులాయుఁడు:—ఓహో! వీఁడేమో దండించుచున్నవాఁడురా? అబ్బా. వీనికి గాలి కున్నంత బలమున్నది కాఁబోలు. వీఁడు వాయుపుత్రుఁడు.

**మహిషుఁడు.**—కాదురా! వీఁడు రండ పెంచినకొడుకు. బలిష్ఠుఁడుగానుండు.

**వృషభుఁడు**—బహుబీజుఁడు. బలవంతుఁడు గాక దుర్బలుఁడగునా? (పిల్లవాండ్రందరు శిలాదిత్యుని బట్టికొందురు. వారిని వాఁ డంటఁగ నెల్లరుఁ గ్రిందఁబడి యుందురు.)

**శ్యాముఁడు.**—(వెఱచి వడకుచు) లేవయ్యా! లేవయ్యా! నేననను. నీకాళ్లపైఁ బడెదను. నను రక్షింపుము. నాతండ్రి కొడుకనే నేను పుత్రుఁడను.

(ఉపాధ్యాయులు ప్రవేశించును)

ఉపా.—శ్యామా! ఏమి గద్దల మిది? వీ రేల వచ్చినవారిబలె నిటు వడినారు?

శ్యాముఁడు.—అయ్యా! నే జెప్పను. చచ్చియుంటినిపో

ఉపా.—శ్యామా! భయమువలదు. తెలుపుము.

శ్యాముఁడు.—ననుఁ జంపినను నేఁ దెలుపను. అయ్యా! భీమసేనుఁ డైనాఁడు వానినే యడిగి తెలిసికొనుఁడు.

ఉపా.—ఆదిత్యా! ఇది యేమి గందరగోళము?

శిలాదిత్య.—అయ్యా ఆశ్యాముని నడిగి దెలిసికొనుఁడు వాఁడే యాదికారణము.

శ్యాముఁడు.—నేఁ జెప్పను అయ్యవారియెదుటఁ జెప్పుమనునది వెలుపట వచ్చినపిదప చంపునది. నాకుఁ దెలుసును.

ఉపా.—ఆదిత్యా! నీవే చెల్పుము. త్వరలోఁ దెల్పుము.

శిలాదిత్య.—అయ్యా. వీరు నన్నవమానపఱచిరి. నేను తంతిని. వీరు వచ్చిరి. వాఁడు తప్పించుకొనెను. అంతలో మీరు వచ్చితిరి

శ్యాము.—స్వామీ! మీరు రానిచో నేను చచ్చియుకగడియ యగుచుండెను.

ఉపా.—ఆదిత్యా. ఏమి యాగడ మిది? వారు నిన్నే మనిరి,

శిలాదిత్య.—ఆశ్యాము నడిగి తెలుసు కొనుఁడి. నే నామాటల నుడవఁ జాల. నే నుచ్చరింపను.

శ్యాముఁడు.—నేను మొదటనే చెప్పను. ఆదిత్యునిఁ జూచినయమునిని జూచినరీతిగ నా కగపడుచున్నది.

ఉపా.—మీ రెవ్వరుఁ దెలుప రెని నే నేమి చేయఁగలను? రాజున కివ్వార్త నిపుడె నేఁ బోయి దెలిపెద. మీరును రండు.

శిలాదిత్య.—అగత్యముగ వచ్చెదను.

శ్యాముఁడు.—నే ను వచ్చెదను.

ఉపా.—రండి. పోదము.

(నిష్క్రమము.)



## తురీయరంగము.



బలభిపురి రాజునాస్థానము.

బలహారిరాజు - మంత్రి క్రోధవర్మ - సేనాని చండశాసనుఁడు
శిలాదిత్యుఁడు - శ్యాముఁడు.

(ఆసనాసీనులై యుందురు.

బలహారిరాజు. —

చ. మనము విచారమగ్న మయె మంత్రి శతంబదియేమొ నిన్న రా
త్రిని నిదురించువేళఁ గడు తీక్ష్ణకరం బగుస్వప్న మయ్యె భా
నునిక్రియ వహ్ని కీలలు ననుక్ వెసఁ జుట్టుచు వేఁచినట్లు భీ
తిని వడి లేచి ఆచ్చపడితిక్ గర మబ్బుర మిద్ది యారయక్.

మంత్రి. మేల్కొన్ననతరినుండి నాయుదరం బది యేమియో శే లిడి కలంచి నట్టుచలించుచున్నది. దీనికిఁ గారణంబు తెలియరాదు.

అనుబంధము 14.

క్రోధవర్మ. రాజన్యా. కలలకై యింత కలఁత యేల? పిత్తప్రకోపం బైనతఱిఁ జిత్తం బుత్తలపడును. అట్టి దశలో మనుజుఁడు కనరానికలలు గాంచును. అట్టికలలనుండి మనుజుల కేకష్టసుఖంబులు గలుగవు

క॥ కలలకు ఫలములు గలవే?
తలఁప మరీచికలజలము తథ్యం బగునే
వలదీవంతలు మానుము
యిల సుఖముగ నేలి మనుమ హితమిది కనుమా.

సార్వభౌమా. ఈబలభిపురి నాకనగరం బనియును నీవు భూలోకదేవేంద్రుఁడనియును లోకాళినిను నేకాలము పూజించు చుండ నీకు వచ్చినభయమేమి? కలలు నిన్నుఁ బోలు బలశాలినిఁ గలంపఁగలవా?

చండశాసనుఁడు.—రాజశేఖరా. చింతకుఁ గారణం బేమి. వైరులునామావశిష్టులై గిరిగహ్వరంబులు చేరిరి. వారిరాజ్యంబు నీకు సమకూరెను.

ఉ కానవె కాని వారిని వగఁ బెగ డొందఁ గఁ జేసి మున్న నే
కానలఁ జేర్చి వారికినిఁ గన్నయవస్థలు గూర్చి పేర్చి స
న్మానము నందితిఁ రిపులమండల మెల్లను మీకు నిచ్చితిఁ
భూనుతక్షత్రియాన్వయవిభూషణ కారణ మెద్ది చింతకుఁ.

సార్వభౌమ. మదవిరోధివర్గాంభోధికుంభసంభవుఁడ వై పాతకారికాండకానన పావకుఁడ వై ప్రమత్తశాత్రవమదావళపంచాననుఁడ వై గర్వాంధీభూతపరిపంథివారివాహప్రభంజనుఁడ వై పరాక్రమవిక్రమంబున నీవు రాజ్య మేలు చుండ సకలజను లెదపైఁ జే యిడుకొని సుఖజీతము గ నున్నవారు. ఇపుడు వచ్చినభయ మేమి? మనోవ్యాకులతకుఁ గారణంబు లేదు గదా? కలలు మనబోటిధీరులఁ గలఁపఁ గలవా?

## అనుబంధము 15.

బలహరి.—అమాత్య. సేనానులారా! మీసాంత్వనోత్సాహవచనంబుల నే సంతుష్టిఁ జెందితిని. జరిగినవార్త మీకుఁ దెలుపక యుండుట యర్హంబు కాదని తెలిపితిని. గాని కలలకు నేను వెఱతునా? సేనానీ! ఆసియాఖండమునుండి యన్యదేశ్యు లనేకులు వేలకొలది వచ్చి సింధునదియుత్తరభాగంబున రాజ్యంబులు స్థాపించు చున్నవా రని యిటీవల వార్తలు వచ్చు చున్నవి కదా? మీ రెవ రైన నదివిచారించితిరే?

చండశాసన.- మహాప్రభూ! వేగులవారిని బంపి సమస్తము విచారించితి. యయాతిసార్వభౌము డేలినసామినగరముదారిగ ననేకు లాసియాఖండమునుండి వచ్చి చేరినారట. వార నేకజాతివారలుగ నున్నవారట. కొందఱు గ్రీకులఁట. హూణులు గొందరఁట. కొందఱుగార్ధబీలు లట. కొందరు పార్థివు లట. యవనులు గొందరట. వారేలయాసియాఖండంబు వదలిరో కారణంబు దెలియ కున్నది. సింధునదికి నుత్తరభాగప్రదేశము వారివసతికి జాలక ఆనదిని తరించిఁ యీహిందూస్థానమును తమభుజపరాక్రమమున జయించి యాక్రమింప దలంచి నారట. మీసేవకుని శరీరమున నూపిరియుండ నావనియెన్నటికిని గాదు. సుఖముగ మీరు రాజ్య మేలుచుండుఁడి.

(భటుఁడొకఁడు ప్రవేశించును)

**భటుఁడు.**—మహాప్రభూ. జోహారు. స్వామీ, ఈ పురి యుపాధ్యాయుఁడు తమదర్శనమునకై వచ్చి కాచికొన్నాడు.

**బలహారిరాజు.**— సేవకా! పిలుచుకొని రమ్ము.

(భటుఁడు పాధ్యాయులను బిలిచికొనివచ్చును.)

**ఉపాధ్యాయుఁడు.**—రాజకులచూడామణీ! అరిరాజి మందాంధకార తరణీ దీనజనదైన్య వినాశక చింతామణీ! సకల సద్గుణగణమణీ! నామనవి వినిచెద. నేను మీగర్భవాసంబునఁ గలజనులలో నొకఁడను. బాలురకుఁ బాఠములు చెప్పి జీవించువాఁడను. ఆదిత్యుడనేఁడియొకబాలుఁడు నేఁడు నేను పాఠశాలకుఁ బోవునంతలో నాశిష్యుల నందరినిఁ జంపినవాఁడు. ఒకఁడుమాత్రము వానిబారిదప్పించుకొనిపారుచుండ నే నడ్డుపడితిని. కలహమునకు మూలకారణంబు వారిరువురిలో నొకరైనను దెలుపక యున్నవారు. కావున ప్రభువుల కీచిత్రవార్తఁ దెలుప వచ్చితిని.

**బలహారిరాజు.** ఏమీ ఉపాధ్యాయులవారూ ఒకబాలుఁడు పలువురినిఁ జంపెననునది చిత్రంబు హింసింపఁబడి మిగిలిన మీశిష్యుఁడు కలహమూలకారణంబు మీకుఁ దెలుప డనునది మఱియు జిత్రంబు. ఏదీ. వా రిరువు రిచటికి వచ్చినారా.

అనుబంధము 16.

**ఉపాధ్యాయులు.**—ప్రభూ. వచ్చినవారు. పిలిచెద.

(అనుచు నాదిత్యుని శ్యాముని బిలిచికొని వచ్చియెదుట నిలిపి )స్వామీ. వారు. వీరేను.(ఆదిత్యునిఁజూపి)వీఁడే నాశిష్యులనుఁజంపి కారణంబుదెలుపక యుండువాఁడు

(ఆదిత్యుఁ డచట నొకపీఠముపైఁ గూర్చుండును

**బలహారిరాజు.**—ఓరీ. నీ వెవఁడవు? దుర్గర్వపూరిత బాలునిరీతిగఁ దోఁచెదు.

**ఆదిత్యుఁడు.**—ఓరీ. నీ వెవఁడవు? రాజ్యమదాంధ భూతచేతస్కుఁడ వని నాకుఁ దోఁచెదు.

**బలహారిరాజు.**—(కోపమున లేచి) ఓరీ. భటా. వీనిని గొనిపోయి చెఱ నుంచుము.
(భటుఁ డాదిత్యునిఁ బట్టుఁ బోయి ద్రోయించుకొనిచచ్చును) (చండశాస

సునిం జూచి) చండశాసనా! నీనిర్దోర్దండంబులు ఖండించి చెఱ నుంపుము. చండశాసనుం డాదిత్యునిశరీర మంటక నే యాదిత్యుఁడు వానిని క్రింద వైచి చంపును. బలహరిరాజు ఖడ్గ మూని చంపెద నని వచ్చును. రాజుచేయి యటులనే నిలచి పోవును. (ఆదిత్యుఁడు రాజునుఁ జంపి సింహాసన మెక్కి)

శిలాదిత్యుఁడు.—(మంత్రినిఁజూచి) ఓరీ నీ వెవఁడవు?

క్రోధవర్మ.—స్వామీ నేను మంత్రిని. క్రోధవర్మను.

ఆదిత్యుఁడు.—మంత్రీ. శిలాదిత్యుఁ డీదినమునుండి బలభిపురిరాష్ట్రపురా జని దేశ మెల్లెడలఁ జాటింపుము. నా కేదేశపురాజు లోఁబడఁడో వానిపై నేనే దాడివెడలి వానిఁ జంపి యారాజ్యం బాక్రమించెద. ఇపుడే యాపని నొనరింపుము. పొమ్ము. (మంత్రి వెళ్లును.)(ఉపాధ్యాయులంజూచి) ఉపాధ్యాయులవారు. మీరు వచ్చినపని ముగిసినది. పొండు. (శ్యామునింజూచి)ఓరీశ్యామా! ఇఁక ముందెవరిని చోరి సేయక బుద్ధిగలిగి బ్రదుకుము. వెళ్లుము.

(అందరు నిష్క్రమింతురు.)

క॥ శశిమంగళ బుధగురు శు
క్రశనైశ్చర రాహుకేతు గ్రహములలోనన్
యశము గాంచు దినేశా
భ క్తిగ సాష్టాంగ మొనరించి ప్రేమన్ గనుమా.

తండ్రీ. నీపరమహాత్మ్యంబున రాజనుఁ జంపి రాజ్యంబు సాధించితి. ముందు దారిఁ దోఁపక యున్నది. నీతనయుని సరసం జేరి కర్తవ్యంబు దెలుపుము వని నినుఁ గూర్చి వేఁడెద.

సీ. సర్వలోకంబుల సంచరించెడిదేవ
సర్వార్థదాయక సర్వరక్ష,
ద్వాదశాత్మక హరిదశ్వ దివాకర
పద్మినీ సమ్మోదపదవిహార,
సుప్తునిఁ బ్రేరేచు సప్తాశ్వ పూషణ
లోకబాంధవ భువనైక నేత్ర,
అంబురుహాప్త కాదంబినీ కారణ,
అంబరమణి విపదబ్ధితరణి.

గీ. ఋగ్యజుస్సామవేదశరీర వీర
సత్పథవిహార సాధుపోషణవిచార
ఆశ్రితానందకర విబుధారిహార
తిమిరపరిహార మిహిర వేగమున రార.

(సూర్యుఁడు సాక్షాత్కరించి)

సూర్యుఁడు.—తనయా. వనట వలదు నీతల్లిని నీసోదరినిఁ బిలపించికొని సుఖముగ రాజ్య మేలుము. నీరాష్ట్రపుజను లందరు నీవు దైవమని పూజించుచుందురు శిలాదిత్య సార్వభౌముఁడని నీవు పేరందుదువు. వేదబాహ్యులు కొందరు నీకు నెల్లకాలంబు శత్రువులై యుందురు. వారితో నీకు సంగ్రామంబు గలుగుచుండును. కుమారా! ఘోరారులపై నీవు సమరంబు జేయఁ దలంతు వేని యీపురి నుండు సప్తాశ్వసరోవరంబు పూజింపుము. అందుండి సప్తాశ్వము వచ్చి నీమ్రోల నిలుచును. దాని నెక్కి ఆదిత్యసాలగ్రామంబు నీసరసనుంచికొని సంగ్రామం బొనర్చితి వేని నీకు జయంబు సమకూరును. తనయా. ఆసప్తాశ్వసరోవరంబు మలినము గా నటులఁ గావలియుంచి కాపాడుము. ఆజలము మలిన మైనచో సప్తాశ్వంబు నీ వగదసాధ్యంబుగాదు. సాలగ్రామంబు నీదైవంబుగ నమ్మి కాపాడుము. ఏమరితి వేని నీవు చెడుదువు. నీజనులను సురక్షితముగ రక్షింపుము. ద్రోహులయెడ దండన మఱవకుము. పరనారీసోదరుఁడవు గమ్ము. న్యాయవిచారమ్మునఁ బక్షపాతము వహింపకుము. దుర్మార్గులను సరసఁ జేర్పకు. మాతృపూజ మఱవకు కష్టసమయమ్మున ధైర్యము వదలకుము. ఈరీతి తనయా! రాజ్య మేలి దశదిశల నీయశం బసదృశముగ నింపుము- నే నిచట చాలకాలంబు నిలువం జనదు. పోయివచ్చెద.

శిలాదిత్యుఁడు.—తండ్రీ. వందనం బొనర్చెద

అనుబంధము 17.

సూర్యుఁడు.—శ్రేయస్కాముఁడ వై యుండుము.

(సూర్యుఁడు నిష్క్రమించును.)

(క్రోధవర్మ ప్రవేశము)

క్రోధవర్మ.—నేటినుండి శిలాదిత్యుండు రాజని చాటఁ బంపితి. నివాసంబునకు నగరేర్పఱచితి. ముం దేమొనరింప నాజ్ఞ యొసఁగెదరో.

శిలాదిత్యుఁడు.—మంత్రీ. ఈపురవరమునం దుండుసప్తాశ్వసరోవరం బహుజాగరంబు, గాపాడునటులఁ గావలియుంచుము ఆజలము నం దెవరిని దమచరణంబులద్ద నీయకు. బట్టలుదక నీయకు. దానిసరస నెవరును బోనటుల నిరోధింపుము. ఆవిషయంబున జాగరూకుఁడ వైయుండుము,

మంత్రి.—మహాప్రభూ! చిత్తము! స్వామీ! దేవరవసతికి సేవకుఁడు నిర్మించిననగరంబు చిత్తగింప వేంచేయుదు రని వేఁడెద.

శిలాదిత్యుఁడు.—మంచిది! పోవుదము.

(నిష్క్రమణము.)



## పంచమరంగము.



మదనుఁడు.—సీ. రమణీయలీలాకురంగచంచలనేత్ర
కాంతిని నిరసించు కనులఁ జూచి।
సితకరమండలద్యుతి సమ్మతింపని
స్మితయుతవదనసౌమ్యతనుఁ జూచి।
తుందిలషట్పదసందోహరుచిబృంద
మందగించెడికచ మొందఁ జూచి।
ఇంపైనపరిపక్వ బింబఫలంబుల
కావిచాయలతావిమోవిఁ జూచి॥

గీ॥ శ్రీ లనఁగ మించువీనులఁ బోలఁ జూచి
దరము నెదిరించుక్రముకకంధరముఁ జూచి
చక్రయుగసామ్యకటికుచ చక్రయుగముఁ
జూచి నవమాలికను గూడ వేఁచినాఁడ.

ఆబిబ్బోకవతియుబ్బినగబ్బిచనుగుబ్బలం జూచిఁ నిబ్బరము వీడి యబ్బురపడితి. ఆపడఁతితొడతీరు రంభలను గేరు' మెడసొరు కంబువుల మీరు. నడుమంబరము గోరు. నడలపొగురు స్తంబేరముల దూఱు. ఆకలికి కచరుచి కంధరము

భోలు కుచయుగము ధరాధరము నేలు. వచనరచన మధురములచాలు. ఆమద పతివదన మమృతసదనము. పద ముం బుజపదము. రదనము మదన కీరోదనము. ఆ శుకకల ననుం జేరి మీనకేతనుకలాపమునc వనివి గీరంబోరి యీ మీటిన మారతాపంబు పరిహరింప దేని నాశరీర మీధర నిలుపుట శక్యమగునా? ఆకుందరదన నాకుం దగినచాన. ఆరాజీవదన మరాళరాజయాన. రాజసోదరి తా ననిc గర్వించి నన్ను నిరాకరించునా? పరిగ్రహంబు నిరాకరించె నేని రతిరాజునాజికి బలాత్కరించి మానసాభీష్టంబుc దీర్చికొనియెద. వనితనుc గోరి వలరేని కాకలc దాటి వలవంతలc జిక్కి శరీరము గ్రుక్కి మేను బాయుట కంటెను సుదతినిం జేరి సకలజనసమ్మత మగుపరిణయముc గోరి సమ్మతింపనిచో వదలక మద మొనవుసునసరవనము బలవంతమ్మున ఫలింపc జేసికొని పిదపc దత్ఫలం బెద్దయైన ననుభవించుట పౌరుషధర్మము. కావున నే నాధర్మ మవలంబించెద. రతిరాజునకు వెఱచినట్టు యౌవనాఢ్యులు భీతి నేలరాజునకు వెఱతురా?

చ. పలుకులు ముద్దులుగ్ జిలుకుc బ్రాయము కాయము నెల్లcబర్విగో
ములు చిలుకుగ్ సరా రుచి మోహనబాణ యుగంబుcబోలుచూ
పులు చిలుకుగ్ జగాసిరులు పొందిగ సౌఖ్యములc జిల్కు మేనహో
చెలువులమిన్న చెల్వయిసులు చిల్కుచుc జుల్కన నన్నుcజూచునే.

ఆకలికి కలయికవిషయము పెద్దలకు వదలc దగదు. రాజపత్నిని వారు దీనిని మనంబునc గొనరు. నాసాహసమె దీని ఫలింపc జేయునట్టి ప్రాముఖ్యము ఎటులైనc జేసెద. చేయక మానను. చేయుట తప్పదు. ఆవనిత దినదినము సాయంకాలమున వనమున సంచరించు చుండును. అట్టిసమయమ్మున నే నెటులైన నటc జేరి ఆహాటక గాత్రినిc జూచి మాటలాడెద. ఆచెలువంపుcజెలి చెలికత్తెలనేకులు నావలకు లోcబడినవారు. వారినాశ్రయించి యేతీరుననైన నానారినిc జేరి కూరిమిమీరc బల్కరించెద. చూపెద నాసాహసము.

అనుబంధము 18.

(నిష్క్రమము:)

శ్రీ

# శిలాదిత్య నాటకము.

## తృతీయాంకము—ప్రథమరంగము.

ఉద్యానవనము.

నవమాలిక. మదనిక. కళావతి

అనుబంధము 19,

**నవమాలిక.**—ఆహా. ఈయుపవనసౌందర్యంబు మానసానందకరంబై యందము మీఱినది. వసంతవల్లభాగమనమున యీవనరమకుఁ బ్రాప్తియైనసుగాఁబోలు కాదేని శిశిరకాల శారీరవ్యాధిని క్షయించి పసచెడిన దీనికినింతటి లక్షణాకారంబు లభించు నెటుల?

ఉ. ఈవనలక్ష్మి నెంత యని యెన్నుదు? మొన్నన కాంది పేదయై
వావిరి వన్నె వాసి చెడి వాడుచు నుండెను? నేఁడు పల్లవ
శ్రీవిలసిల్లి గంధవహసేవిత సుమ ఫలగర్భితంబునై
తావిని దేలుచున్నయది దైవపథంబుల హాటకరూప్యముల్.

**కళావతి.**—నవమాలికా. ఈవనరమకుఁ గలిగిన సౌభాగ్యము స్థిరమా? నడుమంతర పుసిరి శాశ్వతమా? తామున్నసుభవించిన పేదఱికము తలఁపక యౌవన లక్ష్మియెంత విఱ్ఱవీఁగుచున్నది. లలితకిసలయ పత్ర పుష్పఫల భూషణ శోభితయై యువజనుల నెందఱిని నెన్నివిధముల బాధించుచున్నయది?

**నవమాలిక.**—చెలీ. నిజమాడితివి. మన మీరమ్య ప్రదేశంబుఁ జూచి సంతసించి విహరింతము రమ్ము. సఖీ.

క. మలయ గిరిమలయజంబుల
కలయిక భాగ్యంబు గన్న గంధవహుండీ

తలమందలి కొమ్మలకును
గులుకుల నర్తనలఁ గఱపుఁ గోమలి కనవె.

కళావతీ. ఈ కొమ్మల కులుకుఁ జూచితివా? ఎంత ముచ్చటగ నున్నది

కళావతి.—సఖీ. విటపరాజమును గూడు కొమ్మల వింతకులుకు లెంతవర్ణించి నను దీరదు గదా.

గీ. గుచ్ఛకంబనుమిష గబ్బిగుబ్బగవను
చూపు నఱచాటు గను మరు లేపు మిగుల
కుట్మలంబను మిష పల్లుకుదురుఁ జూపు
విటులఁ జూచుచుఁ జేసన్నఁ గుటికఁ జూపు.

ఈ కొమ్మల కుతూహలం బెంతగ నుండునో. నీ వాలోచింపుము. సఖీ. ఈ భూజ రాజముల వర పుష్పములఁ గోరనిజవ్వను లివ్వసుధఁ గలరా?

సీ. కామినీ కలహంసగామినీ కానవే
కామాళు కంకేళి కాంచనముల.

నవమాలిక—అలివేణి కలవాణి జల జాతనిభపాణి
అరయవే కాసారవరము నిచట.

కళావతి.— మందయానా? యరవిందలోచన యెంత
యందమా మాకంద బృంద మిందు.

నవమాలిక. రాజబింబాననా రాజబింబాధరా
రాజిల్లుఁ గను భూజరాజి యిచట.

కళావతి — గీ. పారిజాతమ్ము లివి గను వారిజాక్షి
నవమాలిక.— వారిజాతమ్ము లివె గను నీరజాక్షి
కళావతి.— నీరజాతమ్ము లవి యేల సారసాక్షి
నవమాలిక,— భువనజాతమ్ము లివె గాను మువిద యేలను.

కళావతి.—నవమాలిక. మన నూతనసఖి వనవిహారమునకుఁ దానును వేగ వచ్చెద నని పలికియుండెను. రాక తడిసెను. ఏమి కారణమో.

నవమాలిక.—సఖీ. ఇంతలోనే వచ్చును. మంత్రిభార్య యేదయినఁ బనిపైన నిలుపు కొని యుండవచ్చును.

కళావతి—మనరాజుగారి దేవేరి పుష్పవతినిఁ బిలిచితిని. ఆయమ నే రాఁజాల నని పలికెను.

నవమాలిక.—చెలీ. మావదినె గర్భవతి. కావున వనవిహారంబు సేయఁ జాలదు.

కళావతి—నవమాలికా. మనము పుష్పాపచయంబునకు నాదిక్కునకుఁ బోవుదము రమ్ము (అనుచు వనము లోపలిభాగముఁ జేరుదురు.)

మదనిక ప్రవేశము.)

మదనిక—శా. వెన్నుండన్నయి మున్ను పంచవరను న్వెన్నంటఁగాఁ
జేసెనం చెన్నంగా బడెనన్ను మిన్ననయినే నీయింతిని న్జేరుచున్
జెన్నారంగను మోహపాశములలోఁ జిక్కించి నాప్రక్కకున్
గన్నె న్దెచ్చి యనంగకేళిఁ గలతున్ గల్యాణ సౌఖ్యంబులన్.

ఆహరినీలనికరచికురను వలచి గురుతరమోహాంధకారమునం బడి వెలివెడల దారిఁ గానక యెవెరపును దోఁపక తుద కీసాహసం బూనితి. ఆముకురకపోలచెలులతోఁ జెలిమి యొనర్చి చెలినై యీతలమునకు వచ్చి పోవునంతటిస్వాతంత్ర్యంబుఁ దెచ్చికొంటిని. నేఁడు నామానసంబు దానికి న్వాలివేసి పనిసాధింపవలెను. కాదేని కార్యంబు మీఱును. ఆరాజీవాననను బరోచీరాజున కిచ్చి వివాహ మొనర్ప మనరాజు నిర్ధరించినాఁడట. నావలచినబోఁటిని పరుఁడు రతికూటమునఁ గూడుట నాకుఁ గాటిమంట యగును గదా? అకలాపికలాపకుంతల న్జేరి రతికలాపసల్లాపములు సలిపి నాప్రేయసీ యగురీతిఁ గావింప కున్న నాజీవన మొకజీవనమా? నా దొకసాహసమా?

ఉ. పేరు చెడంగ నిమ్ము మఱిపెద్దలు నన్నని దూఱనిమ్ము నే
సారక మిత్రు లెల్లరును సారెకు హేళి నొనర్ప నిమ్ము వా
దారఁగ నిత్యమున్ జనకుఁ డగ్గిగ మండఁగ నిమ్ము భూవిభుం
డారయఁ జంప నిమ్ము వనజాక్షి రతిన్ గృతకృత్యుఁ డైతనే,

అయ్యో! ఆశైవాలధమ్మిల్లనువాసితకేశజాలపరిమళము నానాసికాపుటము లించుక మూర్కొనినం జాలుగదా. ఆకురంగపాళికళాబింబాళికఫాలతలంబు నానిటల

ప్రదేశంబుఁ జేర్చినచో నానొసట విధాత వ్రాసినభాగ్యరేఖ యదియని నేఁ దలఁపనా? అమదచకోరలోచన మదనకేళిని నిమీలితలోచనయై వీక్షణాంచల మించుక నాపైఁ బ్రస రింపఁజేసిన నాకది స్వర్గసుఖంబై యుండునుగదా? ఆ ప్రవాళరుచిరాధరరుచిరామృత రసం బించుక గ్రోల నిచ్చిన నాయతనుతనుతాపం బాఱునుగదా! ఆనగరాట్పయో ధరి కుచకలశయుగ్మంబు నాహృత్పీఠంబున మంగళదాయకంబుగ స్థాపించినచో నే నెంత ధన్యుఁడ నగుదునో గదా? వేయేల. ఆ యరుణాంబుజాతచ్ఛాయానూపమాన సదమల చరణ తనకోమలచరణాంబుజాతంబున స్మరసంగరంబులో నాశరీర మించుక సోకించి న నేఁ బరమపదానందం బందుదును గదా. ఆకలికి ఆ పలుకలకొలికి అమరునివాము లికి తనకలికిపలుకుల ననుఁ గలయఁబలికినచో పలుకువిలుకానివాములుకులయు లుకు తలకంజేసి కలకాలంబు నా కయిల యే స్వర్గలోకంబని శాశ్వత సుఖానందం బంది యుండనా? ఇఁకఁ గాలవిళంబము సైఁపనోప. ఆకులుకులాడిం జేరెద. దాని చెలికత్తె నచ్చట దానినుండి యేదోయొకనెపంబున నెడఁబాపెద. ఆనవమాలిక చిత్త వృత్తిఁ గని నాకలికిరూపంబు మీఁసి నాకార్యంబు సాధించికొనియెద.

కం॥ హృదయము యదరకు బెదరకు
మదరాక్షినిఁ గలతునేఁడు మదనక్రీడన్
పదిలముగను మాం ప్రాణా
పదకున్ భీతిలను నేనుబడఁతినిఁగూడన్.

(అనుచు మెల్లనఁబోయి కళావతినిఁ జేరి దూరమున బిలిచికొనివచ్చి)

సఖీ! నీవిఁక దూరమ్మునకుఁ బొమ్ము. నే నానవమాలికనుఁ జేరెద.

కళావతి.—సఖా! నాకేమా భయమయ్యెడు. కార్యము వికటించి ప్రకటన యయ్యె నేని మేమంతటఁ జెడినవారమగుదుము. అందరు ననుఁబోలు చపలచిత్తలుండు రని తెలియుము. ఎగ్గులొగ్గులు చూచి సమయముగాఁచి చిత్త వృత్తిఁదెలిసి మత్త వృత్తిఁ ద్రోసి యాతురపడక గుట్టు విడవక నీతిఁ జెడక యాపడఁతి నడవడికఁ గని పలుకు బడి విని పని సాధింపుము. కాదేని కీడు మూడును. హెచ్చరిక.

మతనిక.—మోహనాంగీ. నాకిన్ని హితంబులు దెలుపవలెనా? ఇన్ని వెరవులు గఱ పవలెనా? నిన్న నే నలనాఁడు సాధించునపు డెన్ని యగచాట్లు బడి నిద్రా హారంబులు విడి యెంతబడలితినో నీకుఁ దెలియదా? కడకు సాధించితినా? వదలితినా? నవమాలిక యేమి యాఁడుది కాదా? దాని శరీరము తాఁతఁజేసి

హా! హా! కడుకష్టమాయె. ఈదక్షిణ వాతపోతములు దాక్షిణ్యము మాని యారా త్కుసమారుని పక్షమవలంబించి నను శిక్షింపఁ దొడంగె. ఇఁక ననురక్షించు వారెవరు? అయ్యో. పోరామినిఁ జెంచిన యీకీరాళికి నేనేనేర మొనరించితి. ఇవి యేల నన్ను గేరి మాటలాడి వైరము సాధించెదు.

ఉ. కీరమ వైరమూయిటులఁ గేరుచుఁబల్కెదు నే రమేమి? యా
మారుని తేజినీవయిన మాత్రననారుల పాలిమారివై
కూరిమినీఁగనౌనె? యిటుక్రూరము పూనఁగనౌనె? మాటలన్
భోరఁగనౌనె? పోరచులపో సరమౌనె? విచారదూరవై.

చిలుకా వలదీ చిలుకపలుకులు. రామతత్త్వం రామ రామయని పలుకుచు రాణింప రాదా? కోకిలల కేల యీకిలకిలారావములు. కాకులచేరక్షింపఁబడి కాకమతి వచ్చినది పరభృతములకు లోక సమ్మతమతి కలుగునా? వానిని వీనిని నన నేల? సర్వలోకాధారకుఁడగు శ్రీహరికి కుమారుఁడగు మారుఁడు కుమతియై యీరీతి నారులపైఁబడి పోరుచుండ వానియధికారమునకు లోఁబడిన పక్షుల నన నేల?

మ. మదనాయీమదనేమి? సమ్మదమొ? సన్మాన్యమ్మొ? యీరీతినా!
పదలన్నొంపఁగపట్పదాళిఁ బరభృత్పాళిన్ శుకాళిన్ వళిన్?
మదిరాపానము దావళిన్ గలగి నీమర్యాదల న్బాసియీ
మదిరాక్షిన్ వెతఁబెట్టఁగానగునె! పొమ్మానీకునే నోడితిన్

మారా! నారులకుఁ బుఁడై యీరీతిఁగా ఱింతురా. నీవు శూరుఁడవైతేని నీవైరి నీ శరీరము తన నొసటికంటి మంటచే గాల్చిన త్రిపురవైరిలేడా! అబలనగు నాపై నీ బలము జూపిన నే నేమి చేయఁగలను. నీకు నే నోడితి. నీశరణంటిని. నా జోలికిఁ రాకు. (అనుచు నిట్టూర్పులు సారించుచుఁ గూర్చుండును.)

మదనిక.—(అగపడి సరసంజేరి)

అనుబంధము 20.

ఒహో? నవమాలికా. ఏకతముగఁజేరి యేకత మీగతి వెతఁగుందె దవు? (నవమాలిక యూరక యుండును). నీవుతెలిపిన నేమి. తెలపకున్న నేమి. నేఁ దెలియఁజాలనా? జవ్వనులందఱు నొకపఁవలోనే యుండువారు. ఇట్టివిహారతలములందు పురుష సంయోగా భిలాష చేమిక్కుటముగఁ గుందుచుందురు. ఎవరికిఁ దెలియని దీవ ౨

దీనికి రహస్యమేల? నాకునట్టి యభిలాష లేదా? ఈచందనశైలమందమారుతము కందర్పునకు సహాయముగ సుందరులనేఁచుచుండునుగదా? అనంగునకుఁదోడై యంగనాసారంగముల భ్రమింగఁ జూచుసింగములు గదా యీభృంగములు. మొకమొక వడు నీపికములోపికను బాపి పికవాణులను గళావికలఁ బెట్టు కార్ముకములుగదా? ఈశారుకూతలు గూయు శారికలామారునిఁజేరి నారులపాలిమారులై పోరునుగదా? కలికీ! ఈకలువ లావలరేనికటుకుములుకులై చిలువలం బోలి చెలువుగత్తెలను గఱచుచుండునుగదా? ఆతనునిచేతినిశాతాసిధారలై నూతనశాతోదరులనేతలనిఁ బరితపింపఁ జేయు పెనుభూతములుగదా యీచూతములు. మదిరాపానమదమున మదిఁదెలియక మదిరాక్షుల యెదలపైఁ బొదలుచు మదనుని గుణము వహించి నినదంబులు నేయుచుండునుగదా యీమధుపాళులు! సఖీ! ఈబాధలు నాకు లేవా? నాతో రహస్యమా? నిను బాధించువాఁడెవఁడు? నిజము దెలుపుము. మున్ను బాణాసుర నందనయగు నుషాకన్యకుఁ జిత్రరేఖ తోడ్పడినరీతి నీకు నేఁ దోడ్పడెద. నీమనోభీష్టంబు దెలుపుము. నిన్ను బాధించు వాఁడెవఁడు?

నవమాలిక.—సఖీ- నీతోడనా రహస్యము? ఇది యంతయు నామదనునిప్రభావము.

మదనిక —చెలీ. మదమందుము? మదనుఁడేనా నీమనముఁ గలంచువాఁడు. వానినిపుడే నీసన్నిధినుంచెద. నాప్రభావము గనుము. నే యక్షిణీవిద్య నేర్చినదానను. ఇంచుక యీయడిల్లి యుండుము. నే నిపుడేవచ్చెద. (అనుచుఁ దటాలునఁ బోవును.)

నవమాలిక.—ఏమి యీనాచెలికిఁ బిచ్చి పట్టెనాయేమి? మదనునిఁ బిలిచికొని వచ్చెదనని నిలువక వెడలెను. మదనుఁడు శరీరసహితుఁడై దీనికి దొరకునా? వెఱ్ఱి దీనికిముదిరినది......ఏమి. ఈ చెలిమాటలు వెఱ్ఱి మాటలుకావు మంచి చతురతఁగలిగి మాటలాడుచుండును, అయ్యో! ఏపురుషునిఁ బిలిచికొని వచ్చునోకదా? ఏమిసేయుదు? మదనికా. మదనికా. (యనియఱచును) ఏమీ. మదనికవెళ్లినదే? దీని దేమయినను కృత్రిమాలోచన యుండునా? కృత్రిమాలోచన చేయు నంతటివైరము నాపైన దానికేమియున్నది? ఏమీ తెలియదాయెనే? నాసఖి కళావతి యేదిక్కున నున్నదియో? ఏమియునుఁ దోఁపదాయెను. కానిమ్ము. అదిరానిమ్ము

అనుబంధము 21.

(మదనుఁడు ప్రవేశించును.)

మదనుఁడు.— (నవమాలికంజూచి) ఓ మత్తమధుకరనికరవ్యాకీర్ణచికురా. నీయానతి శిరసావహించి నీసరసఁ జేరితి. ఓ రాకానిశాకరాననా! నీ చరణసేవకుఁడను. పిలిచినదని వినిచి నీ చెలిమికిఁ బాత్రునిగ నొనర్పుము.

నవమాలిక.—(ఱిచ్చపడి యేమియుఁదోఁపని దానింబలెనిలిచి మదనుని నెగాదిగఁ జూచి సందియించి) ఓరీ. నీ వెవఁడవు? ఇటకేలవచ్చితివి. ఈ యువవనంబు నీ వెటుచేరితివి?

మదనుఁడు.—కుటిలాలకా! ఈ మటుమాయలమాటలేల? నీ చెలి మదనిక నీవనుపవని నన్నుఁ బిలచికొనివచ్చెను. నే నీరాజమంత్రికుమారుఁడను. మదనుఁడని నా నామము.

నవమాలి.—ఓరీ మదనా! ఆ మదనికయేదీ? వచ్చినదియా? పురుషుఁడ వగుని న్నీయువవనంబులోపల రాజభటులెటు విడిచిరి ?

మదనుఁడు.—ఓ ఆకర్ణాంతవిశాలలోచనా! ఈరాజభటులకు వెఱచి నీ చెలి మదనిక తన వేషంబు నాకు వేసి నన్నీయువవనంబుఁ జేర్చెను. పిదప నాసహజవేషంబున నే నీసరసఁ జేరితి.

నవమాలిక.—ఓరీ మదనా! ఆ మదనిక నీవెంట రాదాయె నేల?

మదనుఁడు.—ఓ చకితకురంగశాబనయనా! ఆది రాదాయెను. కారణమేమో తెలియదు

నవమాలిక.—ఓరీ కుహకమానవా! నిజముపలుకుము. నీముఖవిలక్షణంబును నీయాకారవికారములును నీ పలుకుఁబడియు నీ కంఠధ్వనియును జూడనీవే యామదనికబూమికఁ బూని మోసమున నాసరస నుంటివని నాకుఁ దోఁచెడు. నిజము పలికి ప్రాణంబులు నిలిపికొనుము.

మదనుఁడు.—ఓరంగత్కనకశుభాంగీ. అట్టి మోసభంగిని నే నటింతునా?

నవమాలిక.—ఓరీ! మదనా. నీవే యాకృత్రిమ మదనికయని నిర్ధరించుట కనేక కారణంబు లున్నయవి. నీవు వయోవంతుఁడవే. క్షత్రియకులోద్భవుఁడవే నీమీసములేమాయెను?

మదనుఁడు.—(మోముద్రిప్పికొని- ఆయ్యో యనుచు) నవమాలికా! మీస[illegible] నేను కొన్ని దినంబు లుంచెదను కొన్ని దినంములు దీసెదను? అవి పురుషోచ్చా జనితగళితములు.

నవమాలిక.—కృత్రిమపురుషా! నీవు మోసగాఁడవు. నిలువుదొంగవు. నీయెదుట నే నుండఁ జనదు. పోయెద. (అనుచుఁ బోవుచుండ.)

మదనుఁడు.—(అడ్డముపోయి) బాలాగోలవై పోవలదు.

ఉ. పోయెదవేల నీవు? ననుఁబోఁడిరో పోయిన నాదుజీవనో
పాయము గాదె? భావభవభల్లము ఝల్లనిపించు నుల్లముల్
ప్రాయము జవ్వనీ! యిటులఁ బాయఁగఁ దోయఁగ నౌనె నీకరో
కాయజుఁ డంగముల్ గాఁచి కాఁకయఁ బెట్టెడుఁ జూడుమాదయన్.

ఓ సంఫుల్లారవిందనయనా. సంకోచము నీకేల? అలరులవిలుకాని యలుగులంబడి పరితపించు నాకు నీపరిరంభణసుఖ మిచ్చి ప్రాణము రక్షింపుము. కామతాపత్రయాక్రాంతుఁడనై కామినీ! నీమధురసధురమగు నధరామృతపానంబుఁ గోరెద. శుకవాణీ. శుకము లానింపఁ దగు నీరదనాంశుకసుధను పానీయముగ నిచ్చి నాదప్పిఁ బాపుము. సిగ్గులాడీ! జగ్గుజగ్గుమని నిగ్గులారు నీకరమూలరుచులు సిగ్గుపడి దాఁచెదేల? నన్ను వెలివానిఁగ జూచెదేల? రత్నరుచిదీపితమృణాళనాళబాహా. ఈనిరాళి నేఁటాళఁ జాల. నీతరంగావళీవళివిలాసరుచిపాళిని ముంచి నీకతాతలనితంబబింబములఁ జేర్చి మనోజరాజ్యరమకుఁ బట్టంబుగట్టుము హల్లకసుమగంధి. వెయ్యేల. నా కిల్లాలవై రతిసుఖమిచ్చి ఖుల్లకుఁడగు మారుని ఖుల్లకబుద్ధి మాన్పుము. నీచరణము లంటి వేఁడెద.

## అనుబంధము 22.

నవమాలిక,—

మ. పొగరా పోసరమా వయోమదము పో పూఁబోఁడు లిచ్ఛాగతిన్
నగరోద్యాన విహారలీల నలుఁయుండ న్నారువేషంబునన్
జిగురుంబోఁడులఁ జేర నీకు నగునా? ఛీ ఛీ దురాత్మాఖలా
మగవాఁడౌదువె నీవు మానినుల నిమ్మాడ్కిన్ విడంబింపఁగన్!

ఓరీ కుటిలకమానవా. కుసుమకోమలాంగులతో నిట్టి కుత్సితములు సేయువాఁడవు నీవొక మగవాఁడవా? పడఁతులఁ బడ నిట్టి వెడఁగులు చేయకు. బుద్ధిగలిగి బ్రదుకుము పొమ్ము!

**మదనుఁడు.**—కలికీ నేఁ బోవుదు నెచటికి. కులుకుజిలుకుచు నీవు చిలుకపలుకులు పలుకుచుండ నిన్నెడబాసి నే బోయి యేమిసేయుదు. ఏమి సేయఁగలను మానసంబు నీసరసవదలి యీశరీరముతో నే నెందుజనిన నేమి; ఎందున్న నేమి? ఇందీవరాక్షి. ఇంపొందునీపొందునందినఁగదా కందర్పునిదర్పము డిందుపడఁజేసి నే నానందంబుఁజెందెద. ఓలపలీదళకపోలా మాయోపాయంబులు మానినులయెడ తగవగునా యని ప్రశ్నించితివి

సీ. తగవగు నేనీవు మగవాఁడవేయని
యగునె యోమగువ నన్నడుగ నిటుల?
మగువలతగులయో మగవారితెగులగు
చిగురుఁబోఁడిరో దీనిఁ జెప్ప నేమి?
నగరాట్పయోధరీ నగవైరినారికై
వగలూటికోడిద్రయె మగువనందె॥
ఆతనియతనిఁబూనియతియు యిక్రీడి తా
సతినిసాధించెసమ్మతినిఁ బడసి॥

గీ॥ కానవే బాల కష్టావమానములను
యౌవనాఢ్యులు గణియింపర వనిలోన
కష్టసాధ్యపుఁబనులచేఁ గలుగు సుఖము
గాన మోసఁపువేసానఁ గానఁబడితి॥

ఉడురాజవదనా! నిన్నుఁ బడయ నేఁ బడినపాట్లైననుఁ గని నీపై నాకుఁగలయనురాగపరిమాణం బెంతయనునదియూహింపుము. రాజ్యపదాన్వయజాతలు. అమాత్యసుతులను బెండ్లియాడఁగూడదని విధియున్నదియా? లేదుకదా? రాజ్య పదంబు దైవయత్నఫలంబుగాని పురుషప్రయత్నసంజనితఫలంబు గాదుగదా! దానిని మనము పాటింపఁదగినది కాదు. ఇఁకఁగులశీల వైభవముల నేను హీనుఁడనుగాను. కావున గాంధర్వంబున నను వివాహమాడి యిపుడె రతికేళినిఁ గూడుము. నిన్నెడఁబాసి నే నుండఁజాల.

**నవమాలిక.**—ఓరీ. నీచాధమా. నాదారి కడ్డుపడకుము. విడ్వుము. నేఁబోయెద.

మదనుఁడు.— ఇంత యొనరించినది నిన్ను వదలుటకేనా! సంరక్షనయనా ఈదినము నీరతిసుఖానందవార్ధినిఁ దేలవలెనొకటి. విషాదవిచారావమానాంబుధిని మునుఁగ వలెనొకటి. ఇదియ నా సంకల్పము.

మ. తరుణీ భావభావాళుగంబులకునేదాళక్ రతిక్ గూడవే॥
నిరతానందము యుండ నైవెలసెదక్ నీరేజపత్రేక్షణా॥

నవమాలిక.— దురితాత్మా సరికాని దీ నడత. ఘోదోషంబు వాటిల్లుఁబో
పరితాపంబగు నీకు దీని వలనక్ బాటింపరా కానరా।

(అనుచుఁ నవమాలికపైఁబడ బోవును. నవమాలిక అటులిటుఁ బరుగుచ నీలవైచును. భటులు వచ్చిమదనునిఁ బట్టికొని తీసికొని పోవుదురు)

(కళావతిప్రవేశము.)

కళావతి — సఖి! యేమి యీయాదడబడలు. భటులేల వచ్చిరి. నీవేల యీాలవేసితివి?

నవమాలిక.— సఖీ! నీవెచటికిఁబోయియుంటివి? ఇంతతడ వేమిచేసితివి?

కళావతి.— చెలీ! పుష్పాపచయంబున కాదికుసుమంబోయి యచటనొక లతాగృహంబునఁ గూర్చునియుండఁ గంటికి నిదురవచ్చినట్టాయెను ఇందుక విశ్రమింతమని పరుండఁ దెలివిలేనినిదురవచ్చెను. నీయీాల విని లేచివచ్చి వచ్చునంతలో భటులు మరలుచుండిరి. సఖీ నీవార్తయేమి? భటులేలవచ్చిరి?

నవమాలిక.— కనకలతా! ఈకాలమున నెవరిని నమ్ముటకు రాదుగదా. మనయుఁ జెలికత్తెగనుండిన మదనిక వాస్తవముగ స్త్రీకాదు.

కనకలత.— (అబ్బురము నటించుచు) ఏమీ—ఏమీ. అది స్త్రీకాదా. మఱియెవరు. రాక్షసియా—పిశాచమా. భూతమా.

నవమాలిక.— చెలీ! మంత్రి కొమారుఁడు మదనుఁడు మదనిక వేషంబుఁదాల్చి నీవు లేని కాలమున నన్ను మదనకేళికిరమ్మని పిలిచెను. వలదనినను వదలఁడాయెను బలవంతమున భంగఁ బెట్టయత్నించెను. యత్నముమీరి యీాలవేసితిని. భటులువచ్చి బట్టుకొనిపోయిరి.

కనకలత.— ఔరా! పురుషసాహసము. ఔరా మదనమహిమ. ఔరా యౌవనగర్వము. సఖీ! ఆమదనికమోముఁ జూచినప్పటినుండి నా కపుడపుడించుక సందియము గలుగుచుండెను. దానిలక్షణంబులు నైతము పురుష లక్షణములుగ

నుండెను నాఁడే నీకు నది తెలుపవలెననియుంటిని. మరల నాకేల యీ యధికప్రసంగమని మిన్నకయుంటిని. ఎంత మోసమిది? మన రాజుగారికిది నే నే తెలిపెద వానిని దండింపఁజేసెద. ఇంతటిదురాగతమా? రమ్ము పోవుదము. ఊపుగదా వానిక్రొవ్వాఱును.

నవమాలిక.— చెలీ! ఇది సిగ్గులచేటుగనున్నది. ఏమిసేయవలెను. పోదమురమ్ము.

నిష్క్రమము.)



## ద్వితీయరంగము.

### క్రోధవర్మగృహబహిర్ద్వారము.

కళావతి—క్రోధవర్మ.

కళావతి.—(స్వగతము)

అనుబంధము 23.

సీ॥ కోమలాకృతినలకూబరనలసౌమ్య
మారజయంతులఁ గేరువాఁడు!
నూనూఁగుమీసాల చేనూఁగుప్రాయమ్ము
మేనాఁగి మెరుఁగెక్కు మేటియగువాఁడు!
వాలంపుసీటుక వాటంపుసాటిని
చాటించునురమునఁ బ్రబలువాఁడు!
ఆజానుబాహువులాజానుగా హెచ్చి
భూజానుశాఖలఁ బోలువాఁడు!

గీ॥ పిడికిటను బట్టనడఁగెడు నడుమువాఁడు
మీనకేతనసంహితానూనవిధులఁ
దెలసి తెఱవలసుఖములఁ దేల్చువాఁడు
కారఁబడియుండఁ గన్నులఁ గాంచుటెటుల!

ఆతరుణీనేత్రచకోరశీతకరుఁడు నావలపులఱేఁడు నామానసాంబుజమిత్రుఁడు కారంబడి కష్టములను భరించుచుండఁ గనులారఁ జూచి సైఁచఁగలనా? నే నేమి సేయుదు? యీలోకములో స్త్రీలు తమ్ముగాపాదుపతులకుఁగలుగు కష్టముఁలెట్టులైన భరింతురుగాని ప్రేమమీఱ మనసారఁ గామించి రతిసుఖములరుచులమించి దయనించెడియు పభర్తల కెట్టిసంకటము గలిగినను జూచి మనసుబిగబట్టి యుండఁగలరా? అయ్యో. ఆనవమాలిక జోలికిఁబోవలదని నావలపులఱేనికి నేనెన్ని హితములుబోధించినను వినఁడాయెను. విటవృత్తి కుటిలవృత్తికదా? కుటిలవృత్తి సర్వకాలంబులందును గోరినఫలంబులిచ్చునా? లోకములోఁ గుటిలాలకలందరుఁ గుటిలవృత్తిఁబూని యిట్టి మాటికి లోఁబడుదురా? వానిఁదలఁచి మనంబుగలఁచినఁ బ్రయోజనంబేమి? ఆమానుని కుట్రోపాయమున లోసంచుగ నేను లోఁబడినానని యానవమాలికకు నాపై సందియము గలిగినది. కావున నే యానడుమునన్నంతగ సరకు సేయదు నామగనికి వార్తకర్ణాకర్ణికముగ నెటు దెలియునోయని భయమయ్యెడు వానినిపుడాలోచించినఁ బ్రయోజనంబేమి? మదనుఁడు సుఖముగ మనినచో నాకే భయములేదు.

ఆ. వె! మగఁడువిడువనిమ్ము మగువలుననుఁ గాంచి
తెగడనిమ్ము తాళిఁదెంపనిమ్ము
శీలమైనకులము కీలికీలలఁ బడి
కాలనిమ్ము విటునిఁగలసియుందు!

కానిమ్ము! వానినిఁ గారనుండి యేవిధంబుననైన వెలిఁజేయవలెను. అప్పనికై రాజుగారిని వేఁడికొందునని నాప్రియునితండ్రి క్రోధవర్మ పోయినాడుగదా? తాను వచ్చువరకు నన్నిచటనే యుండుమనిపలికెను. క్రోధవర్మనిటు టు రాజువినునా? శిలాదిత్య సార్వభౌమునిహృదయము కఠినశిలయనిజనులాడరా? క్రోధవర్మ వచ్చినట్టాయెను

(క్రోధవర్మ ప్రవేశము.)

(క్రోధవర్మ.—వచ్చినిట్టూర్పువిడుచుచుఁ గూర్చుండును)

ఉ. అక్కటనెన్నికష్టముల నందితి సూనునిఁ గానకేనయో!
మిక్కుటమాతపంబుమితిమీఱనొనర్చితిఁబుత్రుఁ గాంచితిన్!
మక్కువమీఱఁ బెంచితిని మంత్రవిధానములెల్లనేర్పితిన్!
ప్రక్కకుమారుఁడాచెఱను సొంపఱఁజూచితి నేమిసేయుదున్!

ఆహా! వృద్ధదశలో నాకెంత దుర్దశ తటస్థించెను? బహుకాల మమాత్యపదవినిఁ బ్రావీణ్యతఁ జెందిన పెద్దయనియైనను నన్ను గణింపక శిలాదిత్యసార్వభౌముఁడు నన్నెంతచులకనఁ జూచెను? నే వానిని యాచించినదేమి? నా సూనుని ప్రాణదానము గదా? రాజ్యమునుండి వెడలించి నను వెడలింపుము. ప్రాణముఁ గాపాడుమని నేనెంతఁ వేడినను నన్నధిక్కరించి "నీదుర్మార్గసూనుఁడు చెఱలో నే ప్రాణంబు విడవఁదగినవాఁడని" పలికెను గదా. ఏమి నే యుపకారములకుఁ బ్రతి నేనేమి యొనర్చుదు. ఈశిలాదిత్యుని పొగరుబోతు వరములు నేనెటులడఁగింతు? . నిజము. వీనిగుట్టు నేనూహించినాను. వీనిపరాక్రమము మేవస్తువునందున్నదనునది నేఁ దలిసినాను వీనిజయమునకు మూలకారణంబు నేనెఱుంగుదును. వీని నెల్లను నిష్ఫలంబు చేయంగల సామర్థ్యంబు నాబుద్ధికిఁ గలదు. అయినను శత్రురాజు లెవరును వీని పేరనిన భీతిఁ జెంది తలవంతురు. వీఁడు దైవసన్నిభుఁడని యూహించుదూ స్థానములంకరించు క్షత్రియరాజులందఱు వీనిఁ బూజించుచుందురు. వీనినెసటు వ్రాఁతకు గీఁతగీయుటకు వేదబాహ్యులైనపరరాజులు గావలయును. అట్టివారు సింధునదియుత్తర భాగంబుననున్నవారు. వారు యుద్ధమునకు బూనిరేని నాబుద్ధిచమత్కృతిఁ జూపి యీభూపతిని భూపతనంబు గావించెద....ఏమి. ఏటియాలోచనలివి? కలలో వార్తలు ...నా సుతునకు సంభవించు ఘోరకష్టమరణంబునకుఁ జింతింపక యేమేమో యాలోచించు వాఁడను.

## అనుబంధము 24.

కళావతి. —(ఎదుటనిలచి) క్రోధవర్మ గారూ. మీరు రాజువద్దకుఁ బోయినపని యేమాయెను?

క్రోధవర్మ —కళావతి! నిష్ఫలమాయెను. అవమానమాయెను. ప్రాణము పోయెను ఏమి నేయుదు? పంచప్రాణంబులఁ జూచి సుతునిఁ గాపాడితి. ఇపుడు గాఁగఁ జేరి కష్టపడునది చూచితి. ప్రాణంబులు పోకనిలిచినవి. అయ్యో మదనా?

కళావతి. మంత్రివరా! ఇట్టియిక్కట్టు సమయంబున నీవు ధైర్యంబు వీడిన మదనుని గతియేమి?

క్రోధవర్మ. కళావతీ! నే నెంతయాలోచించినను నాకదిదోఁపకయున్నది. తోఁచిన మార్గము లెల్ల కంటకకలితంబులైనవి.

కళావతి. —అమాత్యవరా! నేను స్త్రీని. నా స్త్రీసాహసంబించుక చూపి నీసుతునిఁ జెఱనుండి తప్పించితి నని వానిని నీవెటులయిన రక్షింపఁగలవా?

క్రోధవర్మ. కళావతీ, అంతటి పుణ్యమా.

కళావతి.—ఎటురక్షించెదవు?

క్రోధవర్మ.—వలయునంతధన మిచ్చి సింధుదేశంబునకుఁ బంపి యచట హూణులతో నైన పార్థివులతో నైనఁ గలసి యుండులాగొనరించెద.

కళావతి.—క్రోధవర్మా ఆటు లైన రెండుమూఁడుదినములలో నీకొకమారు నిచటికి నర్ధరాత్రిసమయంబునఁ బిలిచికొని వచ్చుటకుఁ బ్రయత్నింతును. గుఱ్ఱములు రెండు సిద్ధపఱచి యుంచుము.

క్రోధవర్మ.—కళావతీ. నీబుద్ధికుశలత నాకంటె హెచ్చని తోఁచును. మంచిది. నీకోరిక రీతి సిద్ధముగ నుండెద. నేఁ బోయివచ్చెద. (పోవును)

కళావతి.—(స్వ. గ.)

సీ॥ శంపారుచుల మించి సొంపారు కాయము
మంపుఁబుట్టింపదే మనుజతతికి ॥
జంపారునడుమును గెంపారునధరము
ముంప దే నరుల సముద్రమునను॥
పెంపారుచన్గవ మంపారుకన్గవ
తెంపఁ జూడవె యెంత నెలివి నైన॥
జంపారుకనుబొమ లింపారుసూగారు
చంపవే ధీరుల తెంపు మిగుల॥

గీ॥ కానఁ గరియానలను గానఁగా జగాన॥
కలఁతఁ జెందుచుఁ దబసులు కానకేగి
తలఁతు రధ్యాత్మతత్త్వంబు తప్పు లగుచు॥
బలయ మీాయిల నబలలబలముఁ దలఁప॥

కావున స్త్రీసాహసంబు చూపెద. కాౌరాధికారిప్రాయమున మీరి నారతిఁ గోరికన్నప్రయత్నంబులు చేసి వేసారి యెల్లకాలము ననుఁ గలయ నువ్విళులూరుచుండును. వృద్ధుఁడు వివాహమాడిననారిని లోకసుందరిని ప్రాయంపు మిటారినిఁ గోరని పురుషుఁ డెవఁడు? ఈమదనుని మనకదన సౌఖ్యంబు వదిల మని నే మదినినమ్మి కారాధికారినిఁదిరస్కరించితి. మరల న్యాయధికారిని మరులయూరులఁ దవిలించి

నాపదదాసునిఁ గాఁ జేసికొని మదనుని యాపదఁ దొలఁగించి వానిఁ గూడి నేను నీరాజ్యంబు వదలెద. హృదయము పదిలముగ నున్నమదిరాక్షిని నన్నాదరించువా రెవరు? నామదనమోహనుఁడు నన్నేమిసేయును? ఏప్పుడు నేఁ బోయినను జవ్వాబు నేయక కన్నులఁ గప్పుగొనియున్నించును. నాపై నెవ రేమిచెప్పినను వినఁడు. నాసాహసముఁ జూపెద. (నిష్క్రమించుచున్నాఁడు.)



## తృతీయరంగము.

### అనంగవర్మగృహము.

అనంగవర్మ—కళావతి.

**అనంగవర్మ.**—

అనుబంధము 25.

**కళావతి.**—

అనుబంధము 26.

(పాడుచు లోపలినుండి యనంగవర్మను బిలుచుకొని వచ్చును.)

మోహనాంగా! ఇన్నిదినంబులు నిన్ను గాలించిరి నని నీకు నాపైనఁ గోపము వచ్చి యుండును గదా? నిజము పరులసౌఖ్యమున కాశించి యదిఫలింపనిచో గోపము కాదా? సుందరాంగా! పురుషులు స్వతంత్రులు. భర్త్రధీనలయిన భామలకు స్వాతంత్ర్యము గలుగునా? ఏమా నామగఁడు ముసలివాఁడుగావున చీరమానినదని పలికి మూడుదినములు పుట్టింటిలోనుంటకు సమ్మతిఁ బడసి వచ్చితిని? ఈమూడుదినములు నే నీ యాధీనము. నన్ను రహస్యముగ నుంచుపని నీయది. నాగుట్టు బయల్పడెనేని నే నన్నిటఁ జెడుదు.

**అనంగవర్మ** — మోహనాంగీ. నీకలయికకు నిన్నిదినంబులు కష్టపడి నీతో సుఖంబు లందుదినంబున నిను రక్షింపఁ బ్రయత్నింపనా? నాతీ! పురుషు లాతురతచే వలచినవనితలు వైరమె వశలుగారై రేయని వేసరిల్లెదరు. కాంతలకుఁ గల కష్టంబు పురుషులకేమి తెలుసును? నాతీ! ఏండ యపుడే యెంతముదిరెను? గాలిలేదు. దాహ మగును.

**కళావతి.**—సుందరాంగా. నీతోఁ గూడ నిచ్చయించి మధురమగు పానీయంబు తెచ్చినాను. త్రాగెదవా?

అనంగవర్మ.—సుందరీ జలము మధురము నీకావితావి మోవిచవికంటెను చవిగ నుండు నా? ఎన్నటికి నుండదు.

కళావతి.— మోహనాంగా. నీకు నాపైఁగల యనురాగాతిరేకంబున నన్ను నుతించుచు మాటలాడెదవు. ఆంతియగాని హెచ్చేమి నావద్ద నున్నది. సుందరా. ప్రొద్దు పో నేల? పానీయమ్ము సేవింపుము.

అనుబంధము 27.

(అనుచు మైకమునీరిచ్చును.)

(అనంగవర్మ దాని నందికొని త్రావును) కొన్నసవిలు కాడా! జలమెంత మధురముగ నున్నదియో చూచితివా?

అనంగవర్మ.—నీరజాక్షీ నిజము నిజము. రుచి తలకెక్కినది.

కళావతి.—వలపుల కాడా. తలయొకటియేల? ఇంతలో దేహమెల్ల వ్యాపించును.

అనంగవర్మ.—చెలీ, యథార్థ మాడితివి. దేహమంతయు వ్యాపించు చున్నయది. (అనంగవర్మ పర్యంకము జేరును.) కళావతీ! తాంబూలము మఱచితివా!

కళావతి.— మోహనాంగా! ఇదిగోయిచ్చితి.

అనుబంధము 28.

(అనుచు వక్కలిచ్చును. నములు చుండగనె అనంగవర్మ హా యని యఱచి మంచము పైబడును.)

మోహనాంగా. ప్రాణేశా. సుందరా! (యని యఱచుచు) సుందరుఁ డింతలో యమ మందిరము జేరును. స్మారకము దప్పినది. మొదట నాపని నేఁ జూచికొని మరల వచ్చెద.

(అనుచు లోపలఁబోయి అనంగవర్మ రాజకీయ వస్త్రముల ధరించి చెఱ తాళములు చేత నిడికొని యొగపాగాచేతిలో బట్టికొనివచ్చి)

నాఅదృష్ట వశమున వీఁడు వేకువలో పెద్దనిదురఁ బోయిన బాగుగ నుండును. నారహస్యము బయల్పడదు. కాదేని కళావతి యింతచేసె నని పట్టణమంతటఁ జాటించును. చావు లేక పోయినను వీనికి వేకువవఱకు స్మారకము దప్పినచో నాపని నేసాధింతును. స్మారకము వచ్చిన యెడల నన్నీ రాత్రియే కనిపెట్టును. కావున నన్ని విధముల శ్రద్ధపడి జాగరూకత వహించి పనిచేయవలెను. వీనియరువది మూరలపాగాలో నే వీనిని

మంచమునకు బంధించెద. (అనుచు పాగాతో బిగువుగ మంచమునకు బంధించి) పోగురుపోతా. మదనుని వదలి నిన్నుఁ గలఁతు నని మదిఁదలఁచితివా? ఏన్నటికి నటు నేయను. నేఁబోయెద. నీ విటఁబడి యుండుము.

అనుబంధము 29.

(నిష్క్రమణము.)



## తురీయరంగము.

### కారాగృహము.

మదనుఁడు. చెఱఁగాచువారు. అజిత్ వర్మ. పరాజిత్ వర్మ.

మద — మ. అగునే కారనుఁజిక్కి! నేనిటు నేపాఱంగ? దైవంబహా!
మగువక్ర్మోల నునిల్పి పంచవిశిఖోన్మాదంబుఁ గల్పించి శీ
లగుణాధిక్కృతసుంచు నశమిటు గాల్పఁ జూచెనే? యేచెనే?
తగునే? ధీరుఁడు వంత స్రుక్కుచు నుస్వాతంత్ర్యంబు బోనాడఁగన్!

అయ్యో. నానుండెకులము కూలెను. శీలము కాలెను. ఇల్లువాసి పొల్లుపోయెను. ఎల్లసుఖములు కల్లలాయెను. నిలుకల్లదుఃఖాగ్ని సహింపసాగెను కలుములెల్ల కాడు గలసెను. తలగంప దింపని వలను పాటు చేకూఱెను. ఆకటా. నాకై నేనింతదుఃఖపడను. నాముసలి తలిదండ్రులు తమయేక పుత్రుఁడీ కారఁజిక్కి కష్టపడుచున్న వాఁడే యని దుఃఖించు చుందురుగదా? అయ్యో. నిర్భాగ్యుఁడు నేఁబుట్టి యెంపటిసుఖములు గాల్పఁ గుంపట్లు పెట్టితిని? ఎంపటికి సుకంటకుఁడ నైతిని? అయ్యో ఈలోకజనాళికి యౌవనము మానమర్యాదపవనకు తారముగదా? ధనాగారకవాటపాటన కుంచికగదా జవ్వనము. కులశీలధరాధర వజ్రధారగదా యౌవనము. ప్రాకృతసత్కర్మ ఫలజలధి బాడబప్రాయముగదం ప్రాయము. ఇట్టిప్రాయము జొద్భదప్రాయమని తలఁపక యింద్రియాధీనచిత్తుఁడనై ప్రాణాపాయమని యైన నెన్నక కుహానాపాయమ్ములు పన్నితి. దాని ఫలంబనుభవించితి.

అజితవర్మ — అయ్యో. పాపము మంత్రికొమారుఁడు మదనుఁడు నిదురరాక సంకటపడియెడు చూచితి వేసఖా?

పరాజితవర్మ.—చూచితి. ఆడుదాని మహిమయిది. కింద మీఁదులు తెలియక తలలోఁ కలెరుంగక మిన్నుమన్నుఁ గానక పుణ్యపాపంబులుఁ దలపక యాఁడువారిగో డుగుడుచు వారందరిగతి యిదేను.

అజితవర్మ —అఁడుదానిని వీఁడేమి చేసెనయా? దు:ఖపెట్టెనా? సుఖమునుభవింపను రమ్మనెను. ఆ రిమ్మలాడిది యేమిపోవుచుండెను ఉభయులకు సుఖము కలుగు చుండెను.

పరాజితవర్మ. ఓరీ. బాగాపలికితివి? అందరు నీనీతి నేర్చికొనినఁ బ్రపంచము నిలుచుట కష్టమగును. నీహితమే నీతియాత మైనచో పెండ్లియేల? పేరంటమేల.

(అనంగవర్మ వేషమునఁ గళావతి ప్రవేశించును)

అనంగవర్మ.- ఎవరురావారు?

అజితవర్మ.—దేవరా! నేను పరాజితవర్మ యున్నవారము. వెనుకటివారిపుడే మాక ప్పగించి పోయిరి.

అనంగవర్మ — ఓరీ. నా కీరాత్రినిదుర రాకయున్నది. గాలిలేక తలనొప్పి లేచినది. నేనిచట మీకావలికాలము జాముపటుకు నుండుదును. నిదురఁజెడి పావము మీరేల లేచి యుండవలెను. మీయిండ్లకుఁ బోయి సుఖముగ పరుండుడి.

పరాజితవర్మ.—ప్రభూ! మీకేల యీకష్టము?

అనంగవర్మ.—ఓరీ. నాకేమి కష్టములేదు. పొండి.

(కావలిఁగాచువారు వెళ్లుదురు )

అనంగవర్మ. -(చెఱవాకిలి తెరచి మదనుని సరసంబోయి చెవిలో యేమోచెప్పి కౌఁగ లించుకొని వెలికివచ్చిచె అవాకిలిమూసి మాటలాడక వెళ్లిపోవును.)

(నిష్క్రమణము. )



పంచమరంగము

మదనుఁడు.—కళావతి—క్రోధవర్మ.

క్రోధవర్మ.—(మదనుని కౌఁగలించుకొని)

సీ॥ ముద్దులతనయ నీమోముఁ జూచెడిభాగ్య
మబ్బె నేటికి మన ముబ్బెనయ్యొ
పసిబాలుఁడో నీదు కుసుమకోమలగాత్ర
మాచెఱినిదు కష్టమందె నేర॥
బాల్యాదిగా నీకు బాయసాన్నములిచ్చి
పెంచినదేహంబు పేదవడెనె॥
చదువుసంధ్యలు నేర్పి సచివాగ్రపదవికి
నర్హునిఁ జేసితి వ్యర్థమయ్యె॥

గీ. ధాతనొసటను వ్రాసె నీరీతి నకట
జననభూమికి దూరమై చనెదె తండ్రి !
మనఁగనోపను నేనిఁక మమత తనయ॥
నీవులేమిని ప్రాణంబు నిలుపలేను ॥

ఆహా! తనయా! నీకిన్ని కష్టంబులు సంభవించెనే ! నిన్నెడఁ బాసినే నెటు మనఁగనోపుదు.

కళావతి.—అమాత్యవరా ; మాకిపు డొక గడియ యిచట నొకయుగమై కంతము మిదికత్తిగనున్నది. కర్తవ్యంబెద్దియో దానినిఁ దెలుపుము. నీకరుణ నీదుఃఖము నీజాలి నీకొమారునిఁ గాపాడదు.

మదనుఁడు.—తండ్రీ! ననుబోలు నిర్భాగ్యుఁడు నాయంతటి దురాత్ముఁడు నీగర్భమునఁ బుట్టరాదయి యుండెను. పుట్టి నీసుఖ కంటకుఁడైతిని. నీపేరు నీఱుగావించితిని. నీకులము గాల్చితిని. నిన్నవమాన వహ్నిలోఁ గెడపితిని. నీయాయువు తగ్గించితిని. దుఃఖమునకు దారిఁజూపితిని. ఇట్టిదుర్మార్గుఁడగు సుతుఁడు నేనుండనేల? తండ్రీ నన్ను ఖండించు కతంబున దండింపుము. నాయనా : ఈ శిలాదిత్యుఁడు నిన్ను వృద్ధునియైనను నరకునేయక ముఖ్యమంత్రియని యాలోచింపక నీమాట గణింపక నీవేఁడికోలు వినకనిండు సభలో నవమానించెనని వింటిని. అంతటినుండి నామానసము పెనుమంట లోఁద్రోసి కాల్చినట్టయినది. ఏటులయిన నీశిలాదిత్యుని రూపుమాపవలెను. ఇదియ నాకోరిక. ఇదియెటు ఫలించునో తెలియకున్నది.

క్రోధవర్మ.—తనయా. దానికి మార్గమున్నది. పార్థివకులసంజాతులు సింధునదికి నుత్తరంబున నున్నవారు. వారిం జేరి యాపురి విభవము సూరారఁగఁ బలికి యేలీరునసైన వారి నీరాజ్యముపై దండెత్తులా గొనర్పుము. అటు నీవొనర్చునది ముందుగ రహస్యముగ నాకుఁ దెలుపుము. అవ్వార్తనే వినినతోడన సర్వప్రయత్నము లొనర్చి శిలాదిత్యుని బలమునకు మూలకారణమైన శక్తిని వానినుండి యెడఁ బాపఁ బ్రయత్నింపవలెను.

మదనుఁడు.—తండ్రీ! శిలాదిత్యుని బలమునకు మూలకారణము లెవ్వి?

క్రోధవర్మ.—తనయా: నాశరీరము శాశ్వతము కాదు. కావుననే నెఱిఁగిన వార్త నీకుఁ దెలిపెద. వీఁడు యుద్ధమునకుఁ బోవునప్పుడెల్ల మనపురిసప్తాశ్వ సరోవరంబు పూజింప నందునుండి యొక సప్తాశ్వమను గుఱ్ఱము వచ్చును. అదియునుఁగాక వీనివద్ద యొక మహనీయ తేజోమయదివ్య సాలగ్రామమున్నది. దానిని వీఁడు సరసనుంచికొని ఆదేవతాహయము నెక్కి యుద్ధమొనర్చునపుడు రెండవ ఫల్గును నిరీతి నజయ్యుఁడై యుండును. కావున రిపులు వీనికి వెఱతురు. ఆదివ్య వస్తువులు రెండును వీనినుండి బాపితిమేని వీఁడు తనభుజపరాక్రమంబున నాజినినారి తేరినవైరులఁ బరిమార్పఁ జాలఁడు. వీని రహస్యమిది. నేను గుర్తించినాడను.

కళావతి—క్రోధవర్మా. ఈవేషంబున మదనునితో నేనునుఁబోయి యచట జనులను రణమునకుఁ బేరేచి యవ్వార్తముమ్మున్నుగ నీకుఁ దెచ్చెద. పిదప నీయొనరించు కార్యములందెల్ల పురుషవేషంబుననో నాసహజ వేషంబుననో నీకు సహాయ్యత నొనరించుచుండెద. ఇచ్చట జరుగువార్తలు చక్కఁగ గమనించి రాజునమ్మిక నీపై హెచ్చులాగు నటించుచుండుము. ఏవీగుఱ్ఱములు? తెల్లవారునంతలో మేమీ మేరమిఱియుండవలెను. కాదేని యపాయము గలుగును.

క్రోధవర్మ.—గుఱ్ఱములు సిద్ధముగనున్నవి. కావలయునన్ని నగలు జీనులలోనుంచినాను. (మదనునిఁజూచి) తనయా (కన్నీరుగార్చుచు) పోయివచ్చెదవా?

మదనుఁడు.—(కన్నీరు గార్చుచు) నాయనా. పోయివచ్చెద. (వందనమిడును.)

కళావతి.—మదనా. ఆలస్యమునకు సమయము కాదురమ్ము.

(నిష్క్రమించుదురు.)

# తురీయాంకము.

## ప్రథమరంగము.

పార్థియన్ భూపతి యాస్థానము

మదనుఁడు - కళావంతుఁడు - పార్థివభూప - సుమతి.

అనుబంధము 30.

**పార్థివుఁడు.**—విదేశ జనులారా. మీచరిత్ర విస్తరముగ వినిపించినఁగాని మిము నే నమ్మను.

**మదనుఁడు.**—(పార్థివునింజూచి) మహాప్రభూ. అట్లైన వినిపించెద.

చ. బలభిపురిన్ వసింతుము నృపాలక నిక్కము బాహుజన్ములై |
వెలయుచునున్న వారము వివేకధనుండగు మంత్రిపుత్రుఁడన్ |
జెలిమిని రాత్రియున్ బగలు చెంగటనుండి సమస్తసౌఖ్యముల్ |
తలఁచినరీతి నాకునిడు దక్షయు నీతఁడు ప్రీతినెల్లెడన్ ||

నృపాలకా! దైవవిచేష్టితంబున నట్టిబలభిపురివీడి యీమిత్రునిఁ గూడి నినుఁ జూడవచ్చితిని. మాకార్యంబు ఫలింపఁ జేయు పనినీయది.

**పార్థివుఁడు.**—క్షత్రియకులజులారా. మీనామంబు లేమి. మీరాపురి వదలుటకుఁ గారణంబేమి?

**మదనుఁడు.**—మహాప్రభూ! నానామము మదనుఁడు నానెచ్చెలి నామంబు కళావంతుఁడు. ఇంకమే మాపురివదలుటకుఁ గారణంబు దుఃఖకంబు. అవమానకరంబు.

**పార్థివుఁడు.**—మదనా. అదియేమి?

**కళావంతుఁడు.**—మహాప్రభూ. అన్వార్థఁ దెలుప నవమానంబని మదనుఁడు దుఃఖించెడు. నానెచ్చెలి దుఃఖకారణంబు బలభిపురి రాజసోదరి నవమాలిక. ఆమోహానాంగి త్రిజగన్మోహిని. దానిని మోహించి రాజుచే నవమానింపఁబడి దేశమువిడిచి వచ్చినాడు

**పార్థివుఁడు.**—మదనా. ఆనవమాలిక యెంతటి రూపరియా

మదనుఁడు!—మహాప్రభూ. దానిసౌందర్యము వర్ణింప నాతరమా?

ఉ. కప్పుగుకొప్పు విప్పుగనఁ గాఱు మొగులంచని చెప్ప నొప్పు నా।
కప్పురగంధి మేనురుచి కాఱుకుఁగంచనఁ దప్పుగాదు; మే।
లొప్పులకుప్ప యప్పడఁతి యొప్పిద మారుచిరాంగ కంబులన్।
జెప్పఁగ శక్యమే క్షితిప; చెల్వచొకాటఁపుఁ జెల్వమెంతయో॥

భూపాలా! ఆగాలుకంటె వాఁడి వాలారుచూపుతూపుల కోపియే పురుషుఁ డీపృథ్వినుండ నేర్చును? ఆనిలసంకులవక్రాలక నవమాలిక యిందు బింబాలికఫలకంబుచూచిన యువజనాళికి సౌభాగ్యఫలంబు సిద్ధించును గదా? ఆవిమలలోలాపాంగ యనురాగాపాంగశృంగారరుచులధాళధళ్యము యౌవనధీరుల మానసము చంచలింపఁజేయు పంచశరుని కృపాణధారలయోలవాలముగదా? ఆబాలేందుఫాల మృదుకపోలద్యుతిరతము సరసుబిజాల ఆమృతోపమానవాక్యజాలంబులు వినినం జాలు. మానవులకు సౌభాగ్యంబులు వెయ్యేల? భూమిపాలా. హెచ్చులు నాపలుకంజాల. ఆమోహినిని త్రిజగన్మోహినిని నే మోహించినకతంబున భూనేత నన్నుఁగారనుంచెను. ఈచెలికానిసాహసమున నేముక్తుఁడనై నీ సన్నిధానంబుఁ జేరితి.

పార్థివుఁడు —మదనా! బలభిపుర విభవమని జనులెల్లరు లోకోక్తిగ వాడుచుందురు. నా వేగులవారు నదేరీతి వర్ణించిరి. ఆపురవైభ మంతటిదియా.

మదనుఁడు.—మహాప్రభూ! ఆపురభేదనము మహోజ్వలవిభవం బిట్టిదని వర్ణింప నాకలవియా?

సీ. కుంభీరదీవ్యద కూపారమునుబోలు
ఖేయముశాత్రవా పాయకరము।
చంద్రోపలోపేత చారుతరంబగు
ప్రాకార మరివార భీకరమ్ము।
హరినీలఘటిత మందిరవాస వారిమధ్య
లరిరాజ హంసల నణతురౌర।
రామణీయకమహారామశృంగారమా
రామాజనాద్యభి రామమౌర॥

8

గీ. ఆ బలారాతి పురమున నధికవిభవ
యుక్తమయి రాజవరులకు యోగ్యమగుచు ॥
బలభిపుర మీా ధరిత్రినిఁ బ్రాభవిల్లు
దానిసౌందర్య మెన్నఁగాఁ దరమె నాకు ?

మహాప్రభూ! ఆ పురిసౌందర్యం బింతయని నే వర్ణింపఁ జాల. తమరు వీక్షించినగాని దానివిభవము వివరింప వశముగాదు.

పార్థివుఁడు.—మదనా! మీరాజుగారిసేన యెంతయున్నది. అది యుద్ధమున నారితేరినట్టిదియా.

మదనుఁడు.—మహాప్రభూ! మారాజు తనభుజబలమును దైవసాహాయ్యమును నమ్మి సేన నంతగఁ బాటింపఁడు. సేన యత్యల్పముగ నున్నది.

పార్థివుఁడు.—మదనా! మీరాజునకు దైవసాహాయ్య మున్నదని పలికితివే. ఏదైవ మెటుల వానికి సాహాయ్యపడు చుండును.

కళావంతుఁడు.—మహాప్రభూ. ఆదిరహస్యము. ఈమదనునిమాటలు నమ్మి మీరాదేశముపై దండెత్తితిరేని మదనునితండ్రిక్రోధవర్మ యారాజునుండి దైవసాహాయ్యం బెడబాప సమకట్టినాడు ఇదినిజము. ముమ్మాటికిని నిజము. నమ్ముము.

పార్థివుఁడు—సుమతీ! వీరిమాటలు వింటివిగదా! ఈవిషయంబున నీతాత్పర్యం బేమి? వీరిని నమ్మి మన మాదేశంబుపై దండెత్తనగునా?

సుమతి.—ప్రభూ! నూతనసహవాసంబు యాతనామూలంబు. బాంధవ్యసంబంధ బంధంబు స్నేహబంధంబు. కావున వీరు మాయాగ్నేయ మతస్థులై మించి మనతో సంబంధ మొనర్చినచో వీరిని నమ్మనగును. కాదేని కాఱియలు మూడునని వారుఁ దోఁచెడు.

క. వేతనజీవికులను మఱి
నూతనమిత్రులను నమ్మనోగులగునయ్యా!
యాతనలకుమూలంబది
భూతలపతి! యీా హితంబు బుద్ధిఁగనుమా॥

మహాప్రభూ! నాకుఁ దెలిసినహితంబుఁ దెలిపితి. ఇందుపై దేవరచిత్తము.

పార్థివుఁడు.—(ఆలోచనసభినయించి) (మదనకళావంతులంజూచి) మిత్రోత్తములారా! ఈదీర్ఘాలోచనాపరుని నాసచివవరునిపలుకులు వింటిరికదా? నాకును నది నిజంబనియును హితంబనియునుఁదోఁచెడి. మీరు మాయాగ్నేయ మతస్థులై నాముద్దులబిడ్డను వయోరూప విలాసవతిని విలాసవతిని నీవును మరల నాయమాత్యవరుఁడగుసుమతి మతియుతమతియగుసుతనుసుతను కళావంతుఁడును వివాహమాడినచో మీమాటలు నమ్మి యారాజుపై యుద్ధమొనర్పఁ బ్రయత్నింతును. ఇది మీకు సమ్మతియా?

మదనుఁడు.—(దూరాలోచనచేసి) మహాప్రభూ! శస్త్రజీవికులగుక్షత్రియులకు జిహ్వాప్రామాణ్యమగును గాని బాంధవ్యబంధంబులు వారిని బంధింపఁజాలవు. అయినను మీరు కృపారసపూరితచిత్తులై మము మీవారిగఁ జేసికొనఁదలంచితిరి కావున మీకు గృతజ్ఞుఁడనై నే నొనరించుమనవి వీనుల విని నన్నాదరింతురని వేఁడెద.

పార్థివుఁడు.—మదనా! అదియేమి?

మదనుఁడు.—రాజేంద్రా. మీమతమే మామతము. మేము సార్వకాలములందు నాగ్నేయోపాసకులము. మేమొనరించునధ్వరంబులందగ్నియే ప్రథమదైవము. కావున మేముభయులము మీమత మవలంబింతుము. ఇఁక వివాహసంబంధమున మీయానతి ననుసరించి మీనందనను బెండ్లియాడ నే సమ్మతింతును. ఈ నామిత్రుఁడు తన్ను సార్వకాల మేలుపతి పశుపతియని నమ్మి కట్టడివ్రతంబు బూనినవాఁడు. ఈమిత్రుని విషయము నా బాల్యముగ నాపాదమస్తకము నాకుఁ దెలియును. కావున నా మిత్రుని మన్నింతురని ప్రార్థించెద.

కళావంతుఁడు.—మహాప్రభూ. నావ్రతభంగంబు సలుపంజాల.

చ. పశుపతి నాకు భర్తయయి పాలకుఁడై గతియైనవాఁడహో!
వశమెటు కాను నావ్రతముఁబాయఁగ భూపతివిన్నవించెదన్।
భృశగతిమంత్రినందనను వేడ్కను నాచెలికాని కిచ్చినన్।
కుశలము నంది యందఱము గూడికయుండుదు మేకవాక్యతన్

పార్థివేశా! క్షత్రియజాతులకు భార్యల నేకులుండుట విధియగునుగాని యేక కాలంబున ననేకపతులుంట దోషము. నేనా పురాణపురుషునకు దేహము ర్పించినాను! నేనొకరికిఁబత్నియగుట వ్రతభంగమగును. మదనుఁడు నీసుతను మంత్రినందనను వివాహమాడి సుఖమున నుండినఁజాలు. వారిఁగూడి నన్నెడఁ బాయక రక్షించుచుండును. మాకెల్లరకిది శుభంబగు. పట్టినపట్టు సాధింప సుల భంబగు.

మదనుఁడు.—నెచ్చెలీ! నీమాటలు నన్ను హర్షాంబుధులో ముంచెను. నేనంపటి భార్యలను వివాహమాడనీ యెంతసంసారలంపటుఁడనుగానీ నిన్నెడఁ బాయుదునా! నీసాంగత్యంబు వదలుదునా? కష్టమున కైనమిత్రుఁడు గదా యిష్టమిత్రుఁడు?

పార్థివుఁడు. మదనా! ఈకళావంతుని మాట నీకుసమ్మతియా?

మదనుఁడు.—ప్రభూ! నానెచ్చెలిమాట నేజవదాఁటుదునా?

పార్థివుఁడు.—సుమతీ! అటులైన మనము వివాహంబొనర్చి బలభిపురముపై దం డెత్తుటకు యత్నింతము.

సుమతి.—మహాప్రభూ! సంతోషము.

కళావంతుఁడు.—ప్రభూ! మీరు నేనంగూడి దాఁడివెడలు మున్నునే నాపురిఁ జేరవలయును. ఆపురిఁజేరి క్రోధవర్మనుఁగూడి లాదిత్యుని బలమునకు మూలకారణశక్తులను వానినుండి యెడఁబా..లెను. దానికి మార్గము న్నది. నెనెఱుఁగుదు.

పార్థివుఁడు.—కళావంతా! నీబుద్ధి యసదృశము. నీపలికినరీతి నీవు చేయందగు ఇఁక నొకమాసమునకు మేమాపురిఁ జేరుదుము.

మదనుఁడు.—మహాప్రభూ! ముదమందితి. నేనును గళావంతునివెంటఁబోయి వానిపనిలోఁ దోడ్పడెదనేని మనపని సులభమగును. కాదేని కష్టసాధ్యం బగు.

పార్థివుఁడు—(ఆలోచించి) బాలకులారా! మనమందరముఁ గూడి వెళ్లుదము.

కళావంతుఁడు. మహాప్రభూ. నాదొకమనవి. మనము బోవునపుడు మనవెంటఁ ..కగ బాడియూడం పగిన వేశ్యాంగన రావలయును వారింగూడి నేనును మారు వేషంబున మదనుఁడును జేరవలయును. మఱియొకటి. క్షత్రియులము

మేము గోహింసచేయము. మీమత మిపుడవలంబించినను మాచేతినుండి గోహింస యొనర్చుటకు మామన మొప్పదు. కొన్ని గోవులను గోహింసచేయు వారును నావెంట రానిమ్ము.

పార్థివుఁడు.—కళావంతా! నీరహస్య కార్యంబున కవి ముఖ్యంబైనచో నగత్యమిచ్చెదను. ఈపటిదినంబుననే సేనతో వెళ్లుము.

(నిష్క్రమము.)



## ద్వితీయరంగము.

### క్రోధవర్మగృహము.

క్రోధవర్మ - కళావతి.

క్రోధవర్మ.—దైవమా! అన్నిటను జెడితిని.

సీ. జనకుని ప్రతిబింబ మని వేదపదులెల్ల
నెవ్వానిఁ గాంతురీ యిహమునందు।
జనకునిదుఃఖాగ్ని శాంతిఁ జేయఁగఁ జాలు
నెవ్వానిసాన్నిధ్య మెలమినింట।
జనకునిజరయను జాడ్యంబు తగ్గింప
నెవ్వాని మృదుభాష యింపుమందు।
జనకునికులధామ చారురత్నంబగు
నెవ్వాని జననమ్ము నివ్వటిలఁగ॥

గీ. అట్టితనయుని నెడఁబాసి యకట నేను
మనఁగ నేలొకో ప్రాణంబు మానలేను
ఏమిసేయుదునాకు మ ఱేరుదిక్కు?
దైవమా! చెడితి నన్నిటఁ దగునె బ్రదుకు॥

అయ్యో దైవమా నాకేమియుఁ దోఁపకయున్నది. నాసుతున కావిదేశంబున నెన్నియిక్కట్టులు మూడెనోగదా. ఏంతశ్రమపడెనోకదా. ఆపార్థియుఁడు రాజు నాసుతునికోఁకకు సమ్మతించెనో యేలికకు ద్రోహమెన్నినవాఁడు వీడని హింసించెనో యేమిసేయుదు ?

**కళావతి.**—(కళావతి ప్రవేశము) అమాత్యవరా! క్షేమముగ నున్నవాఁడవా?

**క్రోధవర్మ.**—కళావతీ! పుత్రవియోగానలంబునఁబడి పొర్లునాను క్షేమమున నేమి? అయ్యో. నాసుతుఁడు కుశలముగ నున్నవాఁడా ? ఏచ్చటనిలిచెను? మీరు పోయినకార్య మేమాయెను ?

**కళావతి.**—సచివవర్యా నీపుత్రునకై నీవు చింతింపవలదు. పోయినకార్యము సఫలమైనది. పార్థివసేన సింధునదినిదాఁటి వచ్చుచున్నయది. నీతనయుఁడు తరుణీవేషంబున నాయింట నున్నవాఁడు. ముందుకర్తవ్యంబెద్ది ? దాని నాలోచింతము.

**క్రోధవర్మ.**—కళావతీ! తరుణీవేషంబున నున్నమదనుని యెవరయినను గుర్తించి నచోఁ గార్యమంతయును జెడునుగదా ?

**కళావతి.**—ఆసందేహము నీవుమానుము. నవమాలికతప్ప మరియెవరును దానిని గుర్తిం పఁజాలరు.

**క్రోధవర్మ.**—కళావతీ! అటులైనఁ బ్రారంభమునమునము రాజుగారిదేవతా ర్చనపేటికలో నుండునాదిత్యసాలగ్రామంబు సాధింపవలెను.

**కళావతి.**—అటు సాధింప సాధనోపాయంబెద్ది ?

**క్రోధవర్మ.**—దేవతార్చనబ్రాహ్మణుని లోఁబఱచు కొనుట.

**కళావతి.**—ఆ బ్రాహ్మణుఁ డివ్వార్త వెలిపెట్టినయెడల నీగతియేమి ?

**క్రోధవర్మ.**—మరణదండన.

**కళావతి.**—అది నీవు కోరుదువా ?

**క్రోధవర్మ.**—ఖీతిల్లినఁ గార్యమగుట యెటుల ?

**కళావతి.**—అమాత్యవరా! అట్టి దుర్మరణంబు నీకగుట నేఁజూడఁజాలను. ఉపాయంబున నేనే యకార్యంబు సాధించెద. నీవొక సాహాయ్యము చే

యుము. నీపైవిశ్వాసంబుగల ప్రాణమిత్రుని యొకని రేపురాత్రి దా[illegible] మందిరద్వారంబున సిద్ధపడి నిలిచియుండులా గొనర్పుము.

క్రోధవర్మ.—ఆగత్య మటులొనర్చెద. నాతమ్మునిఁ బంపెద.

కళావతి.—మరియొకటి సప్తాశ్వసరోవరంబు గాచు కావలివారిపై యధికారివద్దకు నీవుంబోయి విదేశమునుండి వేశ్యాంగనలు వచ్చినారు. రేపుసాయంత్రినుండి జాముపరకు వారియాటపాటలా సరోవరశాలలో జరుగునటు లేర్పాటొనరింప వానికి బోధింపుము. కావలివారచటికివచ్చి వేడకచూచుచుండులా గొనర్పుము. మిగతపని నేఁ జూచికొనియెద

క్రోధవర్మ.—కళావతీ! నీవునిజముగ సర్వకళావతివి నీయానతిరీతిఁ జరిపెద. నాపుత్రునిమోము జూడ నిచ్చయించితి చూపెదవా ?

కళావతి.—అమాత్యవరా. ఇపుడువలదు. కార్యానంతరము నీపుత్రునినీకుఁ జూపెద. నేఁ బోయివచ్చెద. నేఁ దెలిపినది మఱవకుము

(నిష్క్రమించును.)

క్రోధవర్మ.—ఔరా! స్త్రీ సాహసము ?

ఉ. కాంతలబుద్ధి యింతయని కాంచ నశక్యము. ధాతకైన న
త్యంతసరసవిలాసములు దాలిచి యెంతటి వానినైనఁ గా
ఱితుకు బంటుగాఁ గొలిపి ఱేఁడుగ వానినిఁ జేసిరాజ్యమే
లింతురు గోరిరేని ; యువలీలలువారికి ముంచితేల్చుటల్ ॥

కానిమ్ము ఈకళావతి యామదనుని మోహంపువలలోఁబడిలి వానికై యింతసాహసంబు చేయుచున్నది. నాసుతుఁడు చతురమతియైనను కామాంధుఁడై యున్నకాఁటియెఁ జిక్కెను. ఇపుడేమనినను కార్యముచెడును. అన్నియవమానంబులు దిగమ్రింగి కార్యము సాధింపవలెను. మంచిది. ఓపు నేఁ జేయఁదగినపని యిది కాని నాకొకపనిఁ జేయ నాస్త్రీయానతిచ్చెను. చేసెద.

(నిష్క్రమము.)

## తృతీయరంగము.

(సప్తాశ్వసరోవరములో కాలక్షేపము జరుగుచు కావలివారు కైమఱచియుండుదురు. పార్థియర్లు సరోవరమును గూఢవేషమునవచ్చి దులినము జేయుదురు.)

**కళావతి.**—శిలాదిత్యునిబలిమికి యొకయొక్క విరిగెను. ఈ కాలక్షేపముచేయు ధార్వాడరాష్ట్రీయుల లోబరచుకొని సందడిని కావలివారు గమనించని సమయమున మావెంటవచ్చిన పార్థియకాలకు గొందరకు గూఢవేషములు ధరింపఁజేసి గోరక్తమున సరోవరము మలినము జేయించితి. ఇకనిందుండి సప్తాశ్వమువచ్చుట కల్లలాయె. ఇక సాలగ్రామ మొక్కటియున్నది. అది కష్టసాధ్యము దేవతార్చనపేటికలో యుండునది. నాకు వచ్చు టెటుల? దేవతార్చనగృహము శిలాదిత్యసార్వభౌమునిపడకటింటి నానుకొనియున్నది. రాత్రివేళ యీప్రదేశము భటసంరక్షితంబుగదా? (ఆలోచన నభినయించి) ఆహా తెలిసితి. మార్గము నరసితి. దేవతార్చన గృహమున కవతలవైపున నవమాలికశయ్యాగృహము. నవమాలిక ప్రాతఃకాలముననే దేవీపూజ యొనర్చుటకై తనశయ్యాగృహమునుండి దేవతార్చనగృహములోనికి కవాటము కల్పించికొని యున్నదిగదా? ఇపుడీ నవమాలికను. జేరెద. దానికి వివాహమైనది. రేపే భర్తపురంబగు బరోచీకి ప్రయాణంబని వింటిని. నవమాలికం జేరి చిన్ననాటి చెలిమినెరపి యీరాత్రియందే నిదురింప వసతిజేసికొని నవమాలిక నిదురించు సమయంబున సాలగ్రామంబు సాధించెద. ఇదె నవమాలికం జేరెద.

నిష్క్రమము.)



తురీయరంగము.

నవమాలిక శయ్యాగృహము.

కళావతి - నవమాలిక.

**నవమాలిక.**—కళావతీ! యెన్నిదినంబులకు వచ్చితివే. ఎన్నిమారులు మీయింటికిఁ జెప్పిపంపినను లేదు. ఊరనుండి రాలేదని పలుకుచుండిరఁట ఏయూరికి బోయియుంటివి?

**కళావతి.**—నవమాలికా! నాపుట్టినింటికిఁ బోయియుంటిని. అచటఁ గొన్నియిక్కట్టులు వచ్చి నిలిచితిని. పిదప నాచెలినివాహంబు సాగెను. ఆసమయమునఁ బోఁగూడదని నిర్బంధించెను. యత్నము లేక నిలచితిని.

**నవమాలిక.**—చెలీ! నావివాహకాలమున నైతము నీవు రావైతివి. నిన్ను మరల జూచుభాగ్యంబు నాకున్నదియో లేదో. యని చింతించుచుంటిని రేపుఁ బ్రాతఃకాలంబుననే నేను నావరునివద్దకు బరోచికిఁ బోవలయును.

**కళావతి.**—నవమాలికా! భాగ్యశాలినివి. పుణ్యాత్ముఁ వయోవంతుఁడు వరుఁడయ్యెను. సుఖముగ నుండుము ఈప్రపంచంబున ననుఁబోలు నిర్భాగ్యరాలు పుట్టదు.

అనుబంధము 31.

సీ. కంతుని సమరూప వంతుని కాంతుని
కాంచని కాంతకుఁ గలిమియేల।
మంతనమ్మునఁ జేరి చెంతకురాఁ బిల్చి
సంతస మిడలేని కాంతుఁడేల।
కంతుకేళినిఁగాంతుఁ గఱగించి మించని
యింతిజన్మంబేల వంతగాదె।
ఇంతి! నూతనవయో వంతవై ముదుసలి
కాంతుఁడుండిన వేఱుకష్టమేల?

తే. గీ. కులముశీలము వయసునుఁ గూడి రూప
సంపదలమించు భర్త నుతింపఁ గలిగె
నీకు వంచని వింటిని నీరజాక్షి
భాగ్యమిటు లుండవలదె యోభాసురాంగి!

నవమాలికా. నీభాగ్యము నుతింప నెవరితరము?

**నవమాలిక.**—కళావతీ! నేను రేపు ప్రాతఃకాలంబుననే బరోచికిఁ బ్రయాణంబు గావలయును. నిన్ను మరలఁ జూచుభాగ్యం బున్నదియో లేదో యని చింతించు చుంటిని. దైవవశంబున నీవు వచ్చితివి. నెచ్చెలీ. నేడంతయు నాసరసనుండుము. చిన్నతనంబున నాడికొనుచున్న నాచెలికత్తెలెవరు నిచటలేరు. నీవయిన నీదినంబు నావద్దనుండుము. అటులుండిన నీ భర్త కినియునా?

**కళావతి.**—నవమాలికా! నాభర్తకోపపడడు. నాపుట్టినింటినుండి బంధువులు కొందరు వచ్చినారు. వారిని వదలివచ్చుటకు సంకోచముగ నున్నది. అయిన

నించుక యాలస్యముగ రాత్రి వచ్చెదను. నవమాలికా. నిన్నానాఁడు బాధించిన యాదుర్మార్గుఁడు మదనుఁడు కారనుండి తప్పించుకొని పోయి నాడఁట. అది నిజమేనా ?

**నవమాలిక.**—అవునమ్మా ! నిజము. అది చాల నబ్బురముగ నున్నది.

**కళావతి.**—నెచ్చెలీ ! ఆద్రోహి యెటు తప్పించుకొని పోయి యుండును.

**నవమాలిక.**—అది తెలియకయున్నది. కారాధికారి యనంగవర్మ వచ్చి యెన్న డును లేక యాదినము కావలియుండి మదనునిఁ దప్పించినాడని కింవ దంతి యున్నది ?

**కళావతి.**—నవమాలికా! ఆయనంగవర్మ విచారింపఁడాయెనా ?

**నవమాలిక.**—నెచ్చెలీ! తెల్లవారునంతలో నాయనంగవర్మకు మరణమ్ము సిద్ధించి యుండెను. వాఁడు మంచమునకుఁ గట్టఁబడి యుండెనఁట.

**కళావతి.**—ఏమియిది ! ఎంతయచ్చెరువు ? అనంగవర్మని నెవరు చంపియుందురు?

**నవమాలిక.**—నెచ్చెలీ! ఆదురాత్ముఁడు మదనుఁడు చంపియుండునని జనులు సంది యించెదరు. కోటకావలికాచువా రనంగవర్మ మఱియొకమిత్రునిఁ గూడి రాత్రి మూఁడవజామున వేటకై పోయెను. మరల రాలేదని పలికిరఁట. ఈ కృత్రిమోపాయం బెవరిదియో రాత్రి పట్టణంబు వదలిపోయిన యిరువు రెవరో తెలియకున్నది. ఎంత వెదకించినను దొరకరఁట.

**కళావతి.**—అమ్మా! ఇది దైవమాయ. అదుర్మార్గుఁడు మదనుఁడు మరల నిన్నేమి బాధపెట్టునోగదా ?

**నవమాలిక.**—కళావతీ! నాభర్తమందిరమ్ము చేరెద. వాఁడు నన్నేమి చేయును ?

**కళావతి.**—నిజము. అయినను నీప్రయాణమున నీవు భద్రముగనుండుము. నవ మాలికా! అదుర్మార్గునిపేరు తలంచినంతనె భయమయ్యెడు. ఇంత దాహము దీర్చికొని నిదురింతము.

**నవమాలిక.**—అదిగో! జల మా పాత్రయందే యున్నది.

**కళావతి.**—(పాత్రవద్దకుఁ బోయి, తాను నీరుద్రావి. మఱియొక పాత్రలో నీటి లో మైకమును గలిపి.) నవమాలికా! నీకును నీరుకావలెనా ?

**నవమాలికా.**—ఏదీ!—తెమ్ము (అని నీరుద్రావి) సఖీ ! నాకేమో నిదురవచ్చు నట్లున్నది నీమనోహరగానంబు వీనులార విని చాలకాలమాయెను. ఏదీ యొక్కింతపాడుము, గానరసంబు గ్రోలుచు నిద్రించెద,

అనుబంధము 32.

కళావతి.—(పాడుచుండగనె, నవమాలిక నిద్రించును కళావతి నవమాలికాయని యఱచి, నిద్రఁజెందినది యరసి లోనఁబ్రవేశించి సాలగ్రామము సాధించి యధాస్థితిగ తానును బరుండును.)

(యవనిక పడును.)

పంచమరంగము.

శిలాదిత్యుని యాస్థానము.

మంత్రి - సేనాధిపతి - కావలివారు - దేవతార్చన బ్రాహ్మణుఁడు - వేగులవారు - పుష్పవతి.

శిలాదిత్యుఁడు.—అమాత్యవరులారా! సేనాధిపతులారా!

ఉ. భూరియశోవిశాలుఁడయి భూమిసమస్తము నేలి; వైరులన్ ।
భోరజయించి మించితిని బూజ్యుఁడనైతని మేలుగాంచితిన్ ।
గారణమేమొ రాత్రి కలఁ గంటిని మంటలఁ జిక్కిస్రుక్కితిన్ ।
ఘోరముగాను పట్టణము గూలెను గాలెను సర్వసంపదల్ ॥

సభాస్తారులారా! నాకుఁ గలిగిన కలతీరు తలఁచి చూచిన నదిఫలయుక్తమయినదని తోఁచెడు.

క్రోధవర్మ.—(పెడమొగమై మీసలుమువ్వి) రాజన్యా! ఈ పురి నేలు రాజులకెల్ల కలలు ఫలయుతములైనవి. అయినను మియందు దేవాంశయున్నదని జను లాడుదురు. కావున మిమ్మకలలు బాధింపఁ జాలవు.

శిలాదిత్యుఁడు.—అమాత్యవరా! నిజము. దేవాంశయుండినను నట్టిమహిమ భూలోకమునందుఁ బ్రాకృతమనుజసాంగత్యంబున క్షీణించును.

(కావలివారు ప్రవేశింతురు. అందులో నొకఁడు ముందుపడి.)

కావలివాఁడు.—(వణఁకుచు) మహాప్రభూ! చెడితిమి, మీసేవకులము మేము చెడితిమి. అన్నిటఁ జెడితిమి.

శిలాదిత్యుఁడు.—ఓరీ. భటులారా! మీకుఁ గలిగిన భయమేమి? మీకేమి చేటు మూడెను? వెల్లవరఁ దెలుపుఁడి.

కావలివాఁడు.—అయ్యగారూ, నిన్నటిరాత్రి మానసరోవర తీరమున నెవరో యాపులఁ జంపి యాకొలనులోఁ ద్రోసిపోయినారు.

శిలాదిత్యుఁడు.—(ఆశ్చర్యపడి) ఏమీ. ఏమీ. సప్తాశ్వసరోవరము గోరక్తపూరమాయెనా. ఓరీ. మీరందఱు యెచటనుంటిరి? గాడిదెల గాచుచుంటిరే?

కావలివాఁడు.—దేవరా! మమ్మేమిచేసినను సరే. నిజము పలికెదము. ఏదోయూరునుండి భోగమువారు వచ్చియుండిరి. చక్కఁగఁ బాడుచుండిరి. బాగుగ నాడుచుండిరి. వారియాటపాటలఁ జూచుచు మైమరచితిమి. ఆకాలంబునం దీహానియయినది.

శిలాదిత్యుఁడు.—ఓరీ! ఆభోగమువారెవరు? పిలుచుకొనిరండు?

కావలివాఁడు.—అయ్యగారూ! వారెవరైనది కనవలెనని యిదివరకుఁ దిరిగితిరిగి వేసరి కానలేక మీపాదములు చేరితిమి.

(దేవతార్చన బ్రాహ్మణుని ప్రవేశము.)

బ్రాహ్మణుఁడు.—(వచ్చుచు.)

కం. ఆహా పోయెనె? కారణ
మూహాతీతంబు నెఱుఁగ! నోడలువడి కెడెఁ!
దేహము నిలిచినఁ జాలును
శ్రీహరి! నన్నెటుల మనఁగఁ జేసెదో ధరపై ॥

(అందరు లేచి నిలుతురు.)

శిలాదిత్యుఁడు—బ్రాహ్మణోత్తమా! నీదేహంబేల వడకెడు. మీకేయాపద యెవరినుండి వచ్చెను?

బ్రాహ్మణుఁడు—సార్వభౌమా! నే నేమని తెలుపుదును? నిన్నటిదినము పూజించి పేటికయందు భద్రముగనుంపఁబడిన యాదిత్య సాలగ్రామంబు నేఁడు కానరాదు కట్టఁబడిన పేటిక కట్టినట్టే యున్నది.

శిలాదిత్యుఁడు—(ఆలోచనను) గ్రహచారకాలంబిది.

ఉ. పోయెను సంపదాళి చెడిపోయెను సర్వము పోయెరాజ్యముఀ।
బోయెను పట్టణంపుసిరి పోయెను నాబలమెల్ల నాకహా।
యాయువుతగ్గ గ్రమ్మఁగితిని యాపద లగ్గలమయ్యె నగ్గి నా।
కాయమునిన్న గాల్చెఁ గలఁ గంటిని తత్ఫల మిప్పుడక్కటా॥

బ్రాహ్మణోత్తమా! నీవు చింతిలవలదు! నా గ్రహచారమునకు నీవేమిసేయుదువు?

(వేగులవారి ప్రవేశము నమస్కరించి)

వేగోకఁడు.—దేవరా! జోహారులు. సామీ మేమేమని తెలుపుదుము! మిక్కుటమున బలమునుంగూడి సింధునదినిదాఁటి యేజాతిదారయో మనదేశంబు నలుగడల తనసేనను వ్యాపింపఁజేసి పట్టణంబులును పల్లెలను పాడుగొడపి పైరులుచెడపి మనపురిమార్గముగ వచ్చుచున్నవాఁడు తెలిసినవార్తఁ దెలిపితిమి.

శిలాదిత్యుఁడు—సర్వము సమకూరినది! (సేనాధిపతినింజూచి) ప్రతాపా! నీసేననెల్ల సిద్ధపరపుము! పొమ్ము. కోటవాకిలి వేయింపుము సభాస్తారులారా. మీరందరు మీమీమందిరంబులకుఁబోయి సురక్షితముగనుండుడి. పొండి.

(ఆదరు నిష్క్రమింతురు.)

శిలాదిత్యుఁడు.—(సేవకాయని యఱచును సేవకుఁడు వచ్చును) నీవు వెళ్లి వేగముగఁ బుష్పావతినిటఁ దోడితెమ్ము.

సేవకుఁడు.—చిత్తము! (అనుచు వెళ్లును.)

శిలాదిత్యుఁడు.—(స్వ॥ గ॥) నాతండ్రి సూర్యుఁడు క్షీణించినక్షత్రియవంశ ముద్ధరింపుమని పలికెను. నాచేతనైనంత సాహసంబు చేసితి. సప్తాశ్వ సరోవరజలము మలినమైనను దివ్యసౌగ్రామంబు పోయినను నాకాయువు ముగియునని పలికియుండెను. అట్టి కాలమిపుడు తటస్థించెను నాదేవేరి నిండుగర్భమున నున్నది. నలుదిక్కులు విజాతిశత్రువులు వ్యాపించినారు. కావున నాదేవేరిని నెటుల నయిన రక్షింపవలెను.

(పుష్పావతి ప్రవేశము.)

పుష్పావతి.—నాథా! నన్నుఁ పిలిపించిన కారణంబేమి?

శిలాదిత్యుఁడు = మోహనాంగీ! కారణం బతిదుఃఖకరము! నీకుఁ దెలుపరాదని యెంత యాలోచించినను నది తెలుపుట యత్యావశ్యకమై యున్నది.

పుష్పావతి.—నాథా! మీమాటలువిని నాకేమో దిగులగుచున్నది. మానసము కళవళపడుచున్నది. అయ్యో! అంతటి దుఃఖకరమైన కారణంబేమి పొసఁగెను.

శిలాదిత్యుఁడు — ప్రాణేశ్వరీ నీకది తెలుపవలెనని పిలిపించితిని. నీవు వచ్చినపిదప నీకది యెటుదెలుపుదునని సందియించితిని.

పుష్పావతి.—ప్రాణపతీ! నన్నేల సందేహసముద్రమునఁ గెడపెదవు? ప్రమర రాజన్యకులమునఁ బుట్టినక్షత్రియాంగన నేనుగానా? విపత్తువచ్చునన్న ధైర్యము మానుదునా? నీకేల సందియంబు! దుఃఖకారణంబు దెలిపి నన్ను రక్షింపుము.

అనుబంధము ౪౮.

చ. ప్రమరకులాధిజాతనయి ప్రాణపతీ మనమందు ధైర్యమే
సమయమునందునైనఁ గడు సంకటకాలము నందునైనఁ బ్రా
ణముఁ జనునట్టివేళ నయినన్ విడనేర్తునె యెంతకైన న
మ్ముమ యిది తెల్పుమా వెతకు మూలకతమ్ము సమస్తమిత్తఱిన్ ॥

శిలాదిత్యుఁడు.—ప్రాణేశ్వరీ! నాకెంత దుఃఖముండినను దానిని నీమాటలు హరించెను? ఇఁక నావార్త నానుపూర్వికగ నీకుఁ దెలిపెద. వినుము. ఆర్యా! నేను సూర్యపుత్రుఁడను. పునర్భవుఁడను. సూర్యుఁడు నాకుఁ బ్రత్యక్షుఁడై యాదిత్య సాలగ్రామమును సప్తాశ్వ మనుగుఱ్ఱమునిచ్చి వానిఁగొని వైరులసాధింపమనెను అవి నిన్నువలెన కొన్నిదినంబులకు నీయాయువు ముగియునని పలికెను. ఆదివ్యసామర్థ్యంబుననే నిన్నిదినంబులు శత్రుభీకరుఁడనై రాజ్యమేలితి. నేఁ డవిరెండును గానరావు. విజాతిశాత్రవులు మాపురిపై దండెత్తిరి ఈవార్త నీకుఁ దెలుపఁజాలక వదలఁజాలక కష్టపడి తెలిపితిని.

పుష్పావతి.—హా నాథా! మీరుకష్టవార్తయని పలికినపుడు శారీరకష్టము నాకగునని మీరు చింతించుచున్నారని ధైర్యమునఁబలికితిని. ప్రాణేశ్వరా! మీప్రాణమునకే భయమగునపుడు నేనుండనేల? మిమువదలి నేనిం దనుభవించునదేమి యున్నది. మీరులేని నాకీశరీర మతిభారము కాదా?

కం. పతిభూషణమ్ము ప్రాణము
పతియె సమస్తమ్ము క్షితిని భార్యకు నెచటన్
పతిలేని సతికి నెందును
గతిలేదను శాస్త్రవిధులు కల్లలె చెప్పుమా?

నాథా! ఇఁకమిముపదలి యొకగడియయైన నుండను ఉండఁగోరను. ఉండఁ జాలను మీరుపోవుగతియె నాగతి.

శిలాదిత్యుఁడు.— మోహనాంగీ! నీపతిభక్తికి నేఁ గడుమెచ్చితి. నేను శాత్రవులపై యుద్ధమునకుఁ బోవలయును. పోవకతప్పదు. పోవనేని క్షత్రియకులమునకే యపయశస్సు వచ్చును. నేను ప్రాణంబున మరలివత్తుననునది సందేహము.

పుష్పావతి.— నాథా! ఆమాటలాడి నన్నేల కలఁచెదవు. నీవు మరణమునకుఁబోయిన నే నేల యింటయుండవలెను! శస్త్రశిక్ష నాకును చిన్నతనంబున నయినది. ఇఁక యుద్ధంబున నినుఁజంపినవైరి ననుఁజంపకవదలునా? ఇరువురి ప్రాప్తియు నొకటయగును నీకంఠంబుఁద్రెంచు కృపాణధారకు నాకంఠంబుఁ ద్రెంచునపుడు వాఁడితగ్గునా? నీకుఁదగులు శరవారములలో నొకటియైనను నాకుఁదగలవా? నేనును యుద్ధంబునకువచ్చెద.

శిలాదిత్య.— నాతీ! నీవీరీతి బలికిన నాగతియేమి? పూర్ణగర్భంబుదాల్చి పోరొనర్ప గలవా? ఇదియుపూర్వముగదా? భారముగు గర్భము ధరించి శరీరము మోయుటకు కష్టముగునపుడు యుద్ధమున నెటునిల్తువు?

పుష్పావతి.— నాథా గర్భము స్త్రీలకు బరువగునా? బలికనిచ్చును కావున నిను వెంబడించి యుద్ధమొనరింతును

శిలాదిత్య.— ప్రాణసతీ! సూర్యుఁడు నాఁడు సాక్షాత్కరించి క్షీణించు క్షత్రియకులంబు నుద్ధరింపుమని నాకాజ్ఞయిడెను. కావున నీగర్భమున వీరక్షత్రియ పుత్రుఁడుద్భవించును. వానినుండి కులము నిలుచును. కావున నీవు నాహితంబు వినుము. మానగిరంబులోనుండి మలయ పర్వతములోని గుహావరకు బహుకాలముక్రిందట నేనే నొకసురంగమును రహస్యముగ చేయించినాను నీవు ప్రాణపదంబుగ నమ్మినయొకచెలిని నీవెంటగొని యీగొహాలనుండుము యుద్ధమున వైరులజయించితినేని నినుఁగలసెద. కాదేని నీవెటులయిన చంద్రగిరిఁ జేరి పుట్టినయింటిలోఁ బాలునిరక్షించుచు సురక్షితంబుగ నుండుము. ఆబా

లుడు పెద్దయై భుజపరాక్రమంబున దేశము సాధించి రాజ్యమేలు. నీవు వీరమాత వయ్యెదవు.

పుష్పావతి.—మనోహరా! నీమాటకు నేబదులిడసాగిన నీమానసంబున నీవేమి తెలియుదువోయని భీతిల్లెదను. ప్రాణనాథా! ఈభరతఖండ మఖండముగనేలి సార్వభౌమపదవినందిననీకు నేభార్యనై యొకపర్వతగుహలో నేకాంగిగ నివసింపగ నామనమోపదుగదా? ఇట్టిమనగర్భంబున బుట్టినపట్టి యెట్టుగుట్టలో నివసింపనర్హుఁడగును. నా పుట్టినింటికి నే నేమోమిడుకొని పోదును.

సీ. పుట్టుపోఆని మోము బోరామిగనిసమ్మ
దాశ్రువులార్చితో యకటనీవు।
బుడతనుదోడపయి నిడికొని శిరమును
మూర్ధాడితో నీవు ముదముగాను।
విద్యలుగఅవు మ వినయముల్ నేర్పుచు
బుద్ధులు దెలిపితో పూజ్యనుగను।
సుతునకుఁబరిణయ మతిహితముగఁ జేసి
కన్నులఁజూచితో చెన్నుమిగుల॥

గీ. తనయునింగని తనరారి తనివిఁజెందు
భాగ్యమీవంద వైతివి ప్రాణనాథ
నిట్టినిలువునఁగూలెడి నట్టివార్త
వినుచు నేనెటు లీభువి మనుదునయ్యొ॥

హా! ప్రాణనాథా! నాప్రాణంబులు పోవకనిలిచెవి. అయ్యో! నే నేమి నేయుదు?

శిలాదిత్య.—(కన్నీరుతుడుచుచు) నాతి! ఏమి ఈరీతిభీతవైతివి. కష్టకాలమున ధైర్యమూననిచో ధైర్యము చాలు కాలంబు మఱియెద్ది?

చ. వినవె సతీమణీ నలుడు వీడనువిత్తము గోలుపోయి కా।
ననమున దారనువ్వదలి నాతియరణ్యములోన కష్టముల్।

గని సుఖమందెనంత్యమునఁ గాన వెచంద్రమతీ చరిత్రముల్ ।
ఘనమతినీవుధైర్యమునుగాంచుము నిష్టములోర్చుమామదిన్ ॥

ప్రాణప్రియా! నాహితంబువినుము. నాకు సంతసమ్మునింపుము. నాకులముద్ధరింపుము. క్షత్రియకులమ్ము నిలుపుము. వీరమాతవు నీవని జగతిని ప్రఖ్యాతినెఱపుము.

పుష్పావతి.—నాథా! నీయానతిమీరను.

శిలాదిత్య.—అట్లైన ప్రయాణమ్ముగమ్ము. ఈరాత్రియే వెడలవలెను.

(నిష్క్రమణము.)



పంచమాంకము - ప్రథమరంగము.

మదనుఁడు ॥ కళావంతుఁడు,

మదనుఁడు —కళావతీ.

కళావంతుఁడు.—ఏమియిది! కళావతీయని పిలిచెదవు? వేషమునకుఁదగిన భాషయుం డవలెననునది మఱచితివి యా? నన్నీయరివర్గమున నగడుపఱచెదవా?

మదనుఁడు.—నిజము. మఱచితిని. ఈరీతిబుద్ధిచెప్పి నన్నాదరింతువనికదా నిన్నా శ్రయించితి. కళావంతా! మానవమాలిక తనవరునిఁగూడుటకై బరోడీపురి నిన్నగదా వెళ్లినది?

కళావంతుఁడు.—నిజము! నిన్ననే వెళ్లినది. నీకేలదానిజోలి?

మదనుఁడు —కళావతీ. కాదు. కాదు (అని చెంపలు వాయించికొని) కళావంతా.

చ. వలచినయింతినక్ వదలవచ్చునె? శక్యమె? పౌరుషమ్మునే।
నలవడియుండుయానవ ధనాఢ్యుఁ కెన్నటికైన? నెన్నియో।
కలఁతలఁబెట్టికాతిమిలఁ గాంచెను బెట్టి కలంచినట్టి యా
చెలువనునేను పీడుమనె చేతికిఁజిక్కినవేళ; నెచ్చెలీ॥

నెచ్చెలీ! అట్టిచెలువచేతఁజిక్కినపుడు వదలితినేని పౌరుషంబునకది కొఱంతకదా! అట్టివేళ నన్నుఁగని నీవేమందువు? కావున. నేనిపుడే కొంతబలంబుగొని యానవమాలిక వెంటఁబోవువారినిఁ బరిమార్చి యానవమాలికనుబట్టి నాయభీప్సితంబు నెఱవేర్చికొనియెద.

**కళావంతుఁడు.**—సఖా! నీమతము నాకుసమ్మతముకాదు. అనవమాలిక పతివ్రత. పతివ్రతలవ్రతభంగంబుచేయ సమకట్టినవాఁడు చెడునని పురాణకథ లనేకము లున్నవికదా. ఆగాథల నేనుదువనేల? అనవమాలిక నాయనుంగుఁజెలికత్తె. నాబలె నదియును మానసచాంచల్యముగలదేమోయని పరీక్షించుటకునై ప్రారంభమున నీకుఁదోడ్పడితి. ఆసతి నిజముగాఁ బతివ్రతయని నే నిపుడు నిర్ధరించితి. నీ వాయువతిని బలాత్కరించితివేని ప్రాణంబులుత్యజించునుగాని నీవశపడదు. కావున నీవిట్టిపని వదలి కోటను ముట్టడించువారికిఁ దోడ్పడుచుండుము.

అనుబంధము 34.

**మదనుఁడు.**—(ఇంచుకయాలోచించి) నెచ్చెలీ! నీహితమ్ము నీతియుతమ్ము. అయిన నానవమాలికపై నాకుఁగలక్రోధాగ్ని దానినిఁ జూచిహేళియొనర్చి 'నిన్నుకరుణించి వదలితిని. లేదేని నిన్ను భంగపఱచుచుంటినని' యెకసెక్కెములాడకయున్నఁ జల్లాఱదు. దానికై నను నీవుసమ్మతింతువని నిన్నుఁ బతిమాలివేఁడికొనియెద. నెచ్చెలీ! నీచెలిమినిండార ననుఁ గరుణించి యింతపనిఁజేయ నను గ్రహింపుము. హెచ్చుపనికిఁ బోను. నీయాన నీపాదమాన.

అనుబంధము 35.

**కళావంతుఁడు.**—మదనా! నీయిష్టానుసారంబొనర్పుము. ఆపతివ్రతను పంగించుట తప్పఁ బరిభవింప ప్రయత్నింపనని నాచేతిపైచేయిడి బాసజేసినఁ జాలు. నేనమ్మెద.

**మదనుఁడు.**—మోహనాంగీ - (కాదు) నెచ్చెలీ. ఇదిగో బాసఁజేసెద. (అనుచు కేలుపై చేయిడి బాసయొనర్చి) నెచ్చెలీ! నీవుహెచ్చరికగనుండి యిచ్చటిపనులు నెఱవేర్పుము. ఈయుద్ధము దినములలో ముగియునది కాదు. సంవత్సరములకొలఁది కోటముట్టడితప్పదు. రెండుదినములలో నేను మరలివచ్చి నిన్నుఁగూడెద. పోయివత్తునా ?

**కళావతి.**—సఖా! క్షేమముగఁబోయిరమ్ము. బాసమఱవకుము. నాకునుఁగార్యంబున్నది. పోయెద. (అనుచు రంగము వదలివెనుక దాఁచికొని యుండును.)

అనుబంధము 36.

(నలుదిక్కులుజూచి) సారసనయనలయెదుటఁ జేసినబాసలు వానిగనిలుచునా? అంచయానలఁ గూడువేళ మంచనగుటికట్లుకట్టుకు నిలుచునా ? మంచిది. నేఁబోయి నాకార్యంబు సాధించుకొనియెద (అనుచు నిష్క్రమించును.)

కళావంతుఁడు.—(నవ్వుచుఁ బ్రవేశించి) పేఁడుపడతులయెడఁ గట్టుకునిలుచువాఁడు కాడని నాకుఁ దెలియును. వీనిగుట్టు నే నెఱింగినదానను. వాఁడువీఁడననేల. పుడమిలో గాముకులెల్లరు కల్లలాడువారే? 'కామికినిలువెల్లకల్ల' యనిపెద్దలాడుదురుగదా? 'విటులకు సత్యములేదు. వేశ్యకు నియమములేదను' లోకోక్తి లేదా? మగవానికృత్యములు సందునుడిమాయలుగదా? తరుణులపై నీరులయిరులంబడినతరుణుఁడు మరునిశరములకుఁజిక్కి మదమెక్కి నాకిచ్చిన బాసపై మనమునుంచునా? ఉంపడు మానసచాంచల్యముగలవాఁడు కావున నేనెట్లులనయినఁ బ్రయత్నించి యాపత్ప్రతమానంబుఁ గాపాడవలెను. వీనియెడల నాసాహసమింతుక జూపవలెను.

కానిమ్ము. ప్రయత్నించెద. పోయివచ్చెద.

అనుబంధము 37.

(నిష్క్రమము.)



## ద్వితీయరంగము.

### కొండదారి.

(నవమాలిక మేనాలోఁ గూర్చుండి భటులు వెంబడించుచుండ మదనుఁడును వాని సేనయును డాఁగి వారిని ముట్టడించి నవమాలికభటులను బఱుగిడఁ జేసి మేనావారినిఁ దోలి మేనాలో నున్న నవమాలికనుఁ జూచి.)

మద.—సీ. మెఱుఁగారుతళుకరి మెఱుఁగులగుమిచాయ
నిరసింప వెలిరావె నీరజాక్షి!
పసిఁడినీటను బలుబలుమాఱుఁ బులుగడి
గినమోహనాస్త్రమా కనులఁ గనవె!
భావజుదీమమా బంగరురూపమా
ప్రోలను నిలుపుమా ముద్దు లిమ్మ!
మదనమోహనమంత్రమహిమమా గానుమా
మదనుని ననురాగహృదయు సదయు

గీ. మదనకేళినిఁ గూడ మా మగువనీకొమ్మ
కలికిపలుకులుపలుకు బంగారుబొమ్మ
చెఱకువిలుకానిపొగరును జెఱుపనిమ్మ
ఏలసిగ్గింక మోహమా యేలుకొమ్మ॥

నవమాలికా! దైవవశమున నీవు నావశవైతివి. మారమహిమావశమ్మున నేను నీవశుఁ డైతిని. మరుఁడు నన్ను బలాత్కరించుచున్నవాఁడు కావున నిన్ను నే బలాత్కరింపక తీరదు. ఆలస్యమేల. ఇది నీనారోపవనంబు గాదు. యీాలవేసి భటుల బిలుచుటకు? ఇపుడు నే నీలవేసి పంచబాణునిబలము ల్ల రావించెదను చంచలాక్షీ వంచనకు సమయమ్ము కాదిది. కాననమునఁ నెక్కడ దీనవు విన వారిక్కడ లేరు. కానివారికి దక్కనావు నీవు. కాముబారికే ప్రసక్కనాను నేను కావున నిన్ను వదలను. నీపురుషుఁడన నిఁక నే నేను.

నవమాలిక.—(కోపమునఁ గటాలున లేచి) అధమాధమా: ఏమిమాటలాడెదవు?

మ॥ పలువా! పల్కకు మిట్టిపల్కు లిఁకనే నాప్రాణమానంబు హీ।
నలమాడ్కిన్ భజియింపఁ గోరుదునె యేనాఁడైన నెవ్వానిచే।
నలయింపన్ బడియైన? దుర్బలలు స్త్రీ లంచెన్ని యీరీతిగా।
గలతల్వెట్టఁగ నౌనె హీనమతి! యీగర్వంబు నీ కేటికిన్॥

ఓ రాగాంధా! నాసరసకు రాకు. పరాకు మాని రాకేందువదనల బలాత్కరించితి వేని నీ కగుదండన దైవం బెఱుంగు. దూర మఱుగుము. సగర్వ ముడుగుము.

మదనుఁడు.—ఓ! మిటారీ. నీసమ్మతిఁ గోరి రాలేక వేఁడితి నని తలక్రొవ్వి మాటలాడుదువా? మేలెన్నినవానికిఁ గీడని యీకాలమునకుఁ దగినలోకోక్తి కలిగినది. మంచిది. నీకెవరు దిక్కో చూచెద. (అనుచుఁ జేతులుబట్టి) నవమాలికా! ఈసమీపమున నుకి యీాటిమును (అనియీాడ్చుచుండగ.)

నవమాలిక.—(చేతులు విడిపించుకొని పయ్యెదలోనుండి బాకుఁదీసి) ఓరీ! నీవుమగవాఁడ వైతివేని యేదీ! నాసరసకు రమ్ము. జూచెద. నీప్రాణంబులు దీనిలోకోపకారంబుఁ గావించెద ముందర నడుగిడుము.

మదనుఁడు.— (దూరమునకువచ్చి) దీనినిబట్టి యీబాకు వదలింపవలెను. (అనుచు నీలవేయును. భటులిరువురు ప్రవేశింతురు) ఓరీ. భటులారా! మీ రానారిని బట్టి నావెంటఁగొనిరండు. (భటులు నవమాలికవద్దకుఁబోవుచుండ.)

కళావతి.—(కత్తిఁబూని ప్రవేశించును) ఈ నాచెలికత్తెను బట్టుభటులెవరో ధైర్యమున రానిమ్ము. వారి కంఠములుగోసి రక్తముచే గాలువలుపాఱించెద. (భటులు వెఱుగిడుదురు) సఖీ! నవమాలికా! వెఱవకుము; నీపాతివ్రత్యమున కేభంగమును గలుగదు. (మేనమామయువారినిఁ బిలిచి) ఓరీ! మీ రింక సురక్షితముగఁ బొండు. నవమాలికా! మేనాలఁ గూర్చొని నీపురి జేరుము. నీ కింకేభయమును లేదు. పోయిరమ్ము ఈకుమానుసుఁడు నాతో నేకదన మొనర్చునో చూచెద. నన్ను మఱవకుము. నీదారి కెవ రడ్డుపడియెదరో చూచెద.

నవమాలిక.—సఖీ! నీయుపకారంబు నే మనినంతపరమును మఱవను. పోయి వచ్చెద.

కళావతి.—చెలీ! పోయిరమ్ము.

(నవమాలిక నిష్క్రమించును.)

కళావతి.—మదనా! ఏమి మౌనము వహించితివి? ఆనవమాలికతో మాట లాడి యలసితివి కాఁబోలు.

మదన.—సఖీ! నవమాలికతో మాట లెవ రాడిరి? దానిఁబట్టింప భటులఁ బిలిచితి. అంతలో నీవు వచ్చితివి.

కళావతి.—సుందరాంగా! నేనే ప్రత్యక్షముగఁ జూచినవిషయములో నీవిన్ని యబద్ధము లాడితివే? నిన్నేమిసేయవలెను?

మదన.—సుందరాంగీ! నీ వెప్పు డిచటికి వచ్చితివి?

కళావతి.—మోహనాంగా! నీకంటె మున్నే యిచటికి వచ్చి నీవెనుకనే చెట్టుమఱుఁగున నుంటిని. నీవు నవమాలికను ప్రార్థించుట వింటిని. చేయిబట్టి యీడ్చినది కంటిని.

మదనుఁడు.—నాతీ! నాతప్పు క్షమింపుము. ఆనవమాలికను జూచినతోడన నీకు నే నిచ్చినబాస మఱచితిని

కళావతి.—నాథా! అటుమఱచుట సహజము. నీవు కామాంధుడవై బాస మఱతు వని కదా నీవెంటనే నీకుఁ దెలియనటుల వచ్చితి.

అనుబంధము ౩౮.

మదనుఁడు.—ప్రాణప్రియా! నీ వేమైన ననుము. ఎంతైన దిట్టుము. నేఁ జేసినది తప్పు. అదిగో తప్పని నీకు మ్రొక్కెద. దాసరితప్పు దండముతో సరి.

కళావతి.—మోహనా! క్షమించితి. విశేష కార్యము లున్నవి. నేనను గూడి కోటను ముట్టడింపవలెను. పోవుదము.

(నిష్క్రమణము.)



## తృ తీ య రం గ ము.

(పార్థివసేన బలభిపురికోటను ముట్టడించియుండును.)

పార్థివుఁడు.—మదనా! ఎన్ని సంవత్సరము లిటుకోటను ముట్టడింపవలెను. ఎన్ని దినంబులు మన మీరీతి బాధపడుచుండవలెను. ఆహారపదార్థంబు లన్నియును వ్రయయపడెను. దేశములు కొల్లకొట్టుచు మన మెన్నిదినంబులు బ్రదుకగలము. కోటను సాధించుమార్గము నాకుఁ దోఁపక యున్నది.

మదనుఁడు.—జనపాలా! నాకును గష్టముని తోఁచెడు. లోనున్న నాతండ్రి క్రోధవర్మమంత్రము పాలించినటుల లేదు. (ఒకవిధమైనయీల కోటపైనుండివచ్చును)

కళావతి.—మదనా! శబ్దము చేయకు. ఇంచుక నిలువుము. నేడమావాస్యగదా. రాత్రిచీకటి దట్టమైనది. ఆయీలవచ్చిన తలమునకు నేఁ బోయి వచ్చెద.

(కళావతిపోవును.)

పార్థివ.—మదనా! ఈకళావంతు డీలలు విని యాశబ్దము వచ్చినస్థలమునకుఁబోయి వచ్చెదనని వెళ్లెను. అది యేమి సంకేతము?

మదనుఁడు.—భూపాలా! నాకును దెలియదు. ఈకళావంతుఁ డతిసాహసి. ఇతని బుద్ధికుశలత యసదృశము. దూరాలోచనపరుఁడు. అతనిమార్గ మిట్టిదని యెఱింగినవా రెవరును లేరు?

(క ళా వ తి ప్ర వే శ ము.)

కళావతి.—భూపాలా! కోటపైనఁ గ్రోధవర్మ యున్నవాఁడు. ఇంత కాలము తనకుఁ దగినసమయము దొరకదాయె నఁట. నేఁడు దొరకినది. ఒకగంట కాలములో భుజవరాక్రమశాలు రగుభటులు నూర్గురు వచ్చినచో వారిని నూలుపగ్గవు నిచ్చెనగుండ పైకిఁ జేర్పవచ్చు ననియును పిదప కోటవాకిలితీయవచ్చు ననియును పలికెను. అట్టివిక్రమవంతులభటుల నిచ్చిన వారిం గూడి నేఁ బోయి కార్యముసాధించెద.

పార్థియన్.—కళావంతా! నీసాహసము నే నే మనికొనియాడుదు. ఇదిగో నా భటు లెల్లరు నీవశవర్తులు. కార్యము సాధింపుము.

మదనుఁడు.—నీవెంట నేనును వచ్చెద.

కళావతి.—ఏలపలదు! ఎచ్చటికిఁ బోవుదు మన్నను వెంట నంటుదువు. ఇచటనే యుండి వాకిలి తెఱచినపుడు లోపలికి దూరుము. ఇదికోటయెక్కు పని. బోటులఁ జిక్కించుమాట కాదు.

(అనిభటులతో కోటక్రిందనిలచి ఈలవేయును. పైనుండి నూలునిచ్చెన వచ్చును. దాని నెక్కి కోట ప్రవేశించి వాకిలి దెరచి విజయమును బొందుదురు.)

పార్థియన్.—సుమతీ! మన కార్యం బెల్ల నెరవేరెను. రాజ్యవిభవం బెల్లఁ గొల్లబెట్టి యీపురి దహింప జేయుము. ఇక ముందు జరుగఁదగినపని యేమి?

(నిష్క్రమింతురు.)



## చతుర్థరంగము.

మదనుఁడు-కళావతి-రాజపురోహితుడు.

మదనుఁడు.—సుందరీ! నేఁ దలంచినది యొకటి యాయెను. దైవము దలంచినది. యొకటి యాయెను. విధిమాయ లివి గదా!

ఉ. ఇంతిరో, నేఁ దలంచినది యెల్లను మంటలఁ గాలిపోయెఁ జె
ల్వంతయుఁ బోయె నీపురికి నక్కట వైభవ మెల్లఁ బోయె గో
రంతయు నైన సపంయ యహో యిట నిల్వక పోయె నేమియో?
వింతగ నున్న దీవిధము! వీటికి నగ్గి దవిల్చి రెవ్వరో?

మోహనాంగీ! ఇది యేమో విచిత్రముగ నున్నది. మనసేన నంతయును విచారించితి. పురికి నగ్గి తా మెవరును పెట్టలే మని యేకవాక్యతగఁ బలుకుచున్నవారు. పురజనులు నైతము తమకుఁ దెలియదని పలికిరి. ఇదియేమి దైవమాయ.

కళావతి.—మోహనాంగా! శిలాదిత్యుఁడు తనకుఁ గాని పురియుండ నేల యని యీ పనిఁ జేసియుండునా?

మదనుఁడు.—సుందరీ! శిలాదిత్యున కంతటియవకాశమే యుండలేదు. పార్థివసేనం గూడి యతనినిఁ జుట్టి సంహరించినపుడు పట్టణమున కెట్టియాపదయు నుండలేదు పిదపఁగదా మనము నిలుచుటకుఁ గూడస్థలము లేక నలుదిక్కుల నుండి మంటలు మిన్నున నంటఁగఁ బాఱుచు వ్యాపించెను. జనులెల్లరు పరుగిడిరి. ఆహా! యెంతటి విభవమున మించిన పురిని దైవ మొకగడియలో నెంతటి హీన దశకు దించెను.

(వేదశర్మ ప్రవేశము.)

వేదశర్మ.—సీ॥ భూరిభూసురమహాభూరి సౌధంబులు
కూలెను వహ్నిచేఁ గాలి యకట॥
వరవజ్రమణి చిత్రతర రాజనగరమ్ము
చిత్రభానుని చేతఁ జిక్కి కాలె॥
నిర్మలస్ఫటిక కాశ్మనిర్మితస్తంభోప
పాలితసద్మముల్ పాడుగలసె॥
ఆయతరత్న భాగాయతనంబులు
ఆశ్రయాశునకు నాహార మాయె॥

తే॥ గీ॥ దైవవరమున మించిన భూమిభుజుఁడు
దైవగతిఁ జెందె వీడెల్ల దగ్ధమయ్యె
రాజపూజితుఁ డగునేను స్వేచ్ఛ వీడి
యెందుఁ బోవుదు దైవమా యేమిగతియొ

ఆహా! చండభానుకుల ప్రపాలితంబుగాని యిప్పురి బృహద్భానునిఁ గూడు నని పెద్దలనుండి వచ్చిన మాటగ నుండెను. అది సార్థక మయ్యెను నే నిపుడె వారినిఁ జేరుదు. నాబిడ్డ కమలావతి యీరాజభార్య యగు పుష్పవతినిఁ జేరినది. రాజునకుఁ బుత్రుఁడు గలిగె ననియును యా పుత్రుఁడు గుహాంతరమునఁ బుట్టెను కావున గుహుఁడని నామ మిడిరని నానందన తెలిపెను వారెచట నున్నవారో నే నెటు తెలియఁగ గలను ఏమి చేయుదు. ఏగుహ దూఱుదు

(మదనుఁడు - శిలావతిసుందరికి వచ్చి.)

మదనుఁడు.—బ్రాహ్మణోత్తమా! వందనములు.

**వేదశర్మ:**—అయ్యా! నీ వెవడవు ?

**మదనుఁడు:**—ధరణీసురోత్తమా! నేను మదనుఁడను. మంత్రి పుత్రుఁడను,

**వేదశర్మ:**—ఏమి! మదనుఁడ వా నీవు. ఎంత మారిపోయినావు. మదనా! కారనుండి తప్పించుకొని పోయి యిన్ని విపత్తు లీపురికిఁ దెచ్చినవాఁడవు నివని జనులాడుదురు. నిజమేనా ?

**మదనుఁడు:**—భూదేవా! ఆమాట లిపుడేల? కర్మానుసారంబైనది. గతమునకు వెతఁ జెంద నేల? మీరు పుష్పావతి కొమారుఁడు గుహుఁ డున్నాఁడని పలవరించుచుంటిరే? ఆగుహుఁ డెందున్నవాఁడు ?

**వేదశర్మ:**—మదనా! నన్నుఁ జంపుము. లక్షలకొలఁదిగను విప్రులని నిన్నరాత్రి లయమైరి. ముప్పదివేలు కుటుంబపువారు మారుదేశంబుఁ జేరిరి. ఇందరి నీరీతి హింసించిన పాతకి నన్నును హింసింపుము. నే నారహస్యముఁ దెలుపను.

**మదనుఁడు:**—బ్రాహ్మణోత్తమా : పశ్చాత్తాపతప్తుఁడయి నాయాయువు వెల్ల క్షీణమైనది. నీమాటలపోటుచే నన్నేల చంపెదవు. ఇంతటియ ఘోరము మగు నని నేఁ గల నైనఁ దలంప నైతిని. ఏవిధమున నైనను నాపురి సురక్షితముగ నేఁ జేర యత్నించితిని గాని వేరొకటి కాదు. నిన్నటిరాత్రి వచ్చినచేఁ బురి కాలుటకు గారణము దైవమే గాని వేరొకరు కారు. పరు లీదేశంబులు నిండిరి. నిజము. ఐనను నానుండి రాజున కింతటవిపత్తువచ్చె నే యని కుందుచున్నవాఁడను. ఈ యపకృతిని యారాజపుత్రున కెద్ది యైన నుపకృతి యొనర్చి దీర్చికొనఁ ద్రికరణశుద్ధిగఁ నేఁ దలంచితి. దీనికి నీచరణసాక్షి. (అనుచు నమస్కరించును)

**కళావతి:**—అయ్యా! బ్రాహ్మణోత్తమా! నాపుట్టినింటినుండి యిపుడే వచ్చితిని. ఈపురి పాడుపడినది చూచితిని. ఏమిచేయుదునని చింతిల్లుచున్నదానను. నాపతి యేగతిఁ జెందెనో గదా? ఛాందసపువృద్ధక్షత్రియుఁడతఁడని మీకుఁ దెలియునుగదా. నాచెలి పుష్పావతి యేగతి నందెనో గదా! ఆమెనైనఁ గూడవలెనని నిన నామె యెచట నున్నదియో తెలియకున్నది. ఏమియుఁ దోఁపదు. మీరుదప్ప నను రక్షించువారు మరియెవరును లేరు.

భిల్లులు కొందఱువచ్చి.

భిల్లనాయకుఁడు:—అయ్యా! మీరెవరు? శిలాదిత్య మహారాజు పురి నున్నవాఁడా?

మదనుఁడు:—ఓరీ! మీరెవరు? శిలాదిత్యుఁడు బలభిపురముతోఁగూడి కాలిపోయెను. ఊరుపాడాయెను.

భిల్లనాయకుఁడు:—హా: హా! చెడితిమి. మా కిఁక రాజెవరు? అరాజకమై ఈపురి పాడుపడెనుగదా? ముందుభిల్లులను బాలించురాజెవఁడు?

వేదశర్మ:—భిల్లనాయకా! మీదేశ మేలువాండ్లికుఁ డేమాయెను!

భిల్లనాయకుఁడు:—అయ్యా: నిన్నటిదినంబున నే దైవగతిఁ జెందెను.

వేదశర్మ:—ఏమిది దైవమాయ.

మదనుఁడు:—బ్రాహ్మణోత్తమా! మన రాజ కుమారునకు నుపకారంబు నేయుటకు దైవమయి మాకు సాహాయ్య మొనరించినాఁడు. మీరేల దానిని రహస్యముగనుంచి చేతఁ జిక్కినదానిని జెఱుపఁ జూతురు. (భిల్లనాయకునిం జూచి) భిల్లనాయకా! శిలాదిత్యుని పుత్రు డున్నవాఁడు. ఆమహనీయుని పుత్రుని మేము పిలుచుకొని వచ్చెదము. ఆబాలునకుఁ బట్టంబుగట్టి రాజ్య మేలింప మీరుసమ్మతింతురు గదా?

భిల్లనాయక:—అయ్యా! ఆతనిరాజ్య మతఁడేలుటకు మాసమ్మతియేల? ఆబాలుఁడు మారాజ్య మేలునంతటి భాగ్యము కలుగునే?

మదనుఁడు:—అటులైన మీరు వెడలి నగర మలంకరింపుఁడు. రెండు దినములలో నాబాలునిఁ బిలిచికొని వత్తుము.

భిల్లనాయకుఁడు:—మంచి దయ్యా! మేము పోయి వత్తుము. మీరాజు కుమారునిఁ బిలిచికొని త్వరలో రండు. రాజ్య మరాజకమైనది.

(భిల్లనాయకు నిష్క్రమణము.)

మదనుఁడు:—బ్రాహ్మణోత్తమా! ఆబాలుఁ డుండుచోటు నీవిపుడు తెలుపకతప్పదు. తెలుపవలెను.

వేదశర్మ:—మదనా! నీకారహస్యము దెలుప సందియ మగుచున్నది. మఱేకుంపటి దేశమునకుఁ దెచ్చి పెట్టెదవో యని భీతియయ్యెడు. దుర్మార్గప్రవర్తన యలవాటుగఁగల వానిమాట నమ్ముట కష్టము

కళావతి:—విప్రవరా! నిజమాడితివి. ఇట్టివారు దాముచేసినబాస వానికఁబాటింపరు.

మదనుఁడు:—ఏమీ. నే నంతటి నమ్మకద్రోహినా! నాప్రతిజ్ఞవినుఁడి.

సీ॥ కల్ల నేఁ బలికినఁ గాలపాశము నాదు
కంఠము దొంపనీ కరుణవదలి॥
కల్ల నేఁ బలికినఁ గాలకూట విషంబు
మేనెల్ల వ్యాపించి క్రింగనిమ్ము॥
కల్ల నేఁ బలికినఁ గాలానలజ్వాల
లెల్ల నామే నంటి యేర్చనిమ్ము॥
కల్ల నేఁ బలికినఁ గఱకంఠుశూలమ్ము
కాయమెల్లను గ్రుచ్చి కలపఁ నిమ్ము॥

గీ॥ కల్ల గాదిది నాయాన కన్నతల్లి
యాన భూదేవ నీయాన యాదిదేవు
నాన నమ్మమ తప్పితి నేని ఘోర
నిరయభాజనుఁడగుదు నే నిలుతు వెతను॥

వేదశర్మ:—అటులైన మనమందరము పోయి గుహుని పిలుచుకొని పోయి మూండలి రాజధానికి రాజుగ నేర్పరుతుము.

గుహానిపట్టాభిషేకము.

సమాప్తము.

# (Appendix)—అనుబంధము.



## అనుబంధము 1.

### మాండురాగము—ఆదితాళము.

సూత్ర:—శ్రీదేవా మహాదేవా భావమ్మున నిను సదా సంస్మరింతూ॥ పల్లవి॥
ఘనుని నిన్ను మనమునందు దినదినము నే సదా
నయభయముల వినుతలజేతూ కనునను కరుణా ॥శ్రీ॥ అ॥
కాలకాలముల నిన్ను కలుషహరా కృపబ్రోవా
వేడెదము నిరతమ్ము కనుమము
దురితహరా ధరణివరా భావమ్మున నిను ॥శ్రీ॥ ౧॥

## అనుబంధము 2

### హిందూస్తాని తోడిరాగము—రూపకతాళము.

సుభగ:—వెసనాయె తాళన్నవగు ధాతలంబునందు నిల్వను॥
బరువాయెనాతను వెల్లను ధరణిని నేమననీగతీ॥
తరమెరతండ్రి నైపాజాలను॥ ౧॥
పతిలేనిదీసతి యంచును క్షితిలోన నన్ను దూరగ
అతిహీన నైతినోపఁజాలను॥

## అనుబంధము 3.

### ధన్యాసిరాగము—ఆదితాళము.

సుభగ:—చింతలోనజిక్కెను స్వాంతమెల్ల నేడయో పతిహీన నైతిని
గతిచెడినిల్చితి వితయయే బ్రదుకిటు వెతలాయె॥ నింత॥ ౧॥
నను గాంచు కాంతలు గనుదూరు రోతగా
ఘనమాయె వెసనము మనలేనూ నేను॥ ౨॥

## అనుబంధము 4.

### మాళవరాగము—ఆదితాళము.

సుభగ:—నిన్ను వేఁడెదా దేవాధిదేవ వందనంబునీకు దీనజనావనా ॥
గతికానని కాంతనన్ను గాంచి కరుణానునన్ను కావుమయ్యదేవ॥
మనియుండలేను మానహీనగాను మహిమాతిశయా
మానితంబుగా మహిలోన నెటుబ్రోచి మన్నించుమికా -
మహిలోన నేను మనియుండజాల మానితంబు
గాను బ్రోవుమయ్య దేవ॥

## అనుబంధము 5.

### రాగము—తాళము.

సూర్య:—అళికులాలకాకను వలదికచింత వినుమా
జాలిమాలి కాముకేళి కలయుము మేరమార
భూరిధీర మదమున ॥అ॥ ౧॥
భామ నీ భయము వదలుము యికను
జాలిమాలి కాముకేళి కలయుము
మేరమీర భూరిధీర మదమున॥ ౨॥

## అనుబంధము 6.

### మోహనరాగము—రూపకతాళము.

సూర్య:—కోమలాంగి కరుణ గాంచుమా
కోరుకోర్కె లెల్లదీరు కోమలినను కరుణగనుము ॥కోమ॥ ౧॥
కాంతరో మొక్కెద చెంతను జేరుము సంతసముందుము ॥కోమ॥ ౨॥
చేడియ నేడికమారుని వ్రతమును సలుపకవదలను ॥కోమ॥ ౩॥
మూడగునిమిసములైనను నిన్నునె గూడకవదలను ॥కోమ॥ ౪॥

## అనుబంధము 7.

### బేగడరాగము—రూపకతాళము.

సుభగ:—నిరుపమసుందర శేఖరుఁడో రాకాశశిజోకగు
మారుడో సకలమాలరుడో॥

చిగురుబోన్నును చెడుచుపాదము చేరిపోల్పఁగ
లేదుసామ్యము చూడచంద్రికకాంతి
జెలగెడుజగతిని మించు చెలువుమోము
సూరుడో బలు సుందరుడో॥

## అనుబంధము 8.

### అఠాణారాగము—ఆదితాళము.

సూర్య:—వారిజాక్షియిటు వాడగా చింతయె
చాలుచాలుయికను మదినందు మోదాము ॥ప॥
చిత్తమందు కలఁప మేలునంచు నీవు తత్తరిల్ల
దెలారిత్తగాను చిత్తవృత్తి॥ ౧॥
హరిసాక్షినన్ను మారు కేళిదేల్చి భూరి
మోదమందు దారిగాంచి చేర రావె॥ ౨॥

## అనుబంధము 9.

### తోడిరాగము—రూపక తాళము.

ఆదిత్యుడు:—కలతీరుదెలుపవె నాపనని వినెద ॥ప॥
జనకువార్త వినగోరి, నిను జేరితిని వడిగను మనములరగ
మనవిధమును వినుపవేదయ॥ ౧॥
సస్మోదమ్ము నెమ్మనమ్ము సదయత మదిగని ముదమున॥ ౨॥
బెదరనునే నదరనునే వదలనునే వలదనినా
ముదమును సొదవగ తెలుపవె॥ కల॥

## అనుబంధము 10.

### కల్యాణిరాగము—త్రిశ్రగతి తాళము.

నవమాలిక:—అన్నయ్య యింతటి పన్నములంబడి చెన్నరు
పాతగునా నాయన్నా చెన్నారు పాతగునా॥
యన్నానీకేమి కన్నడల్గగ్గె మంనించి తెల్పవెరా॥

## అనుబంధము 11.

### గౌరీమనోహరి రాగము—ఆదితాళము.

సుభగ:—ఆదిదేవరా సతీ బ్రోవనూ
సాదరంబుగా దారకావగాను
దేవనిన్నువినా వేఱుదారిగానా ౧॥
భూరిచింతనూ దారికానలేను
భారమాయెమనా దారణీని నేను॥ ౨॥

## అనుబంధము 12

### హిందూస్తాని తోడిరాగము—ఆదితాళము.

సూర్య:—కోమలాంగీ వ్యసనమేలనే యిటుస్వాంతాము చింతిల్లగా
మానినీమణీ రో మానసమందున మారుని సంతోషము
వెలాయింతగా చింతిల్లయింతిరో నీకేలనే
కాంతరోసంతా సస్వాంతమునగ నను ఇత్తునే నుండీకనూ।

## అనుబంధము 13.

### కాపిరాగము — ఆదితాళము.

శిలా:—నాయన్నా నాకేమిగతీ - తెల్పావన్నా నాయన్నా నాకేమిగతీ॥
యెటులనీదూవియోగమూనూ దాల్తునయ్యా కడసారయ్యె నాయన్నా।౧।
సూర్యు:—జనక నేను నిల్వజాల యిలను సంతోషముచే
రానాయన్నా నీకేమి భయమున్నులేదు॥ ౨॥

## అనుబంధము 14.

### అఠాణా రాగము—రూపకతాళము.

క్రోధవర్మ:—భానుతచరితా మాన్యమా మానుమా భీతిని ॥ప॥
కాననికలలకునీ - మానసమున కలతల్ మూనకగునే
తగునేమానుమికను లేని భయము ధారుణీశ

రాజ్యమేలు వారికిట్టి స్వప్నములు ఆగలుకలుగుఁ
జగతిని కారణములు కానరావు॥ ౧॥
మేదురువు కష్టమొంది మేనుజూక్కె వేళ మేదిని
కలుగుఁ గలలవిమేదిని పతియూఱజిల్లు॥ ౨॥

అనుబంధము 15.

రాగము—తాళము.

బలహారి:—సారసాగ్రేసరులారా సంతోషమూనితి మీరాడువాక్యములా॥
కలనిక్కముగునె యీ యిలలోన నెందైన
తలకూగల్లునెదీనా వలదీక చింతింప ॥సర॥
కొరతాయెమీవంటి వరమంత్రూలా నాకూ
సరసాను మేలగాగ పరమూముంగళాముగు॥

అనుబంధము 16.

బేగడరాగము—ఆదితాళము.

బలహారిరాజు:—యెంతకార్యమా వింతయూయె చూడ
బాలుడింతటి పనులుచేసెనే ॥వ॥
నమ్మచాలుదు యిమ్మహిని ॥యెంతకార్యమా॥

అనుబంధము 17

నాటకరంజిరాగము—ఆదితాళము.

శిలాదిత్యు:—నిరజాప్తానమోస్తు నిరతాయతమంగళ దాతాపాదాయత॥ని॥ ౧॥
అసుర విసరహంతా అమరాజ్ఞితా
మతిభానితా వార్థాంచితా
యోాలోహితా భూరిహితా
అమరవంద్యపాదా అమృతాంశుదా
విమలాస్పదా వితాపదా॥

## అనుబంధము 18.

### బ్యాండు రాగము—ఆదితాళము.

మదనుండు:—అలోచన - లేలా మేలు - సాహాసము
వాలాయము - బూని జేతు - సాహాసము
నారీమణి - చేరాగను - సాహాసము
భూరీమతి - చేయూదును - సాహాసము
బోటీగన - మాటలాడు - సాహాసము
నీటూగను - చేయుదును - సాహాసము
నారీరతి - చేరి - రీతి - సాహాసము
గోరీఫల - కారీయను - సాహాసము॥

## అనుబంధము 19.

### బేగడ రాగము—ఆదతాళము.

మదనిక, కళావళి }:— వనతలమునుగను - మనూళవుఘున విభవము ॥పల్ల॥
మందయాన - సుందరారవింద బృందమిందు గానవే
డెందమందు నందమందు ముదముగను॥ ౧॥
నాగయాన - తిగలిందు - నా గేసోగ లోగుమిర గా
పోగుదాకు - బాగుమిర - జిగిమిగుల॥ ౨॥

## అనుబంధము 20.

### సావేరి రాగము—చాపు తాళము.

మదనిక:—వనితలభాగ్యము వసుధనుభర్తయే వానెల్లగను యెందును
యెవ్వనవిభవము యెప్పరిగననుండ - యవ్వారికిని లాభమేమియు లేదుగా॥

## అనుబంధము 21.

### ఆరభి రాగము—ఆదితాళము.

నవమాలిక:—పిలచివచ్చెద ననియే కలావాణి చనియె॥ పిలచి॥
కలికిమాటలు కలికివెల్లెనిక పిలచునెవ్వరో
కలయగ నిత్తరి రీచాలు నేనిటు కాలము
పుచ్చుటకులగు నేవని నెలతలు నిల్వగ॥ ౧॥

మదికిహెచ్చినా వెతలుమీరగను మదను డీదినము
చెదరిచెమూనము ఉదరాదిక బాధలనీరధి
పోదునూ యింటికి వదలెద యీాపని॥ ౨॥

అనుబంధము 22.

నాటకురంజిరాగము—ఆదితాళము.

మదనుడు:—కరుణగాంచు మా తరుణ వేడేవను
నిరతము నినుమదీ మఅవను గావుము
ఆయురాష్ఠీ వినవే మాయమాటలాడా॥

అనుబంధము 23.

(గజులు)రాగం—తాళం.

కళావతి:—హాసఖా - నినువీడి - నేనెటు లోపుదు
భారమీభువిమనా - నైపానోప॥ ౧॥
కారనూ నినుగనా గోరితీ నాప్రియా
చేరుదూ నెటులయో తాళాజాలా॥ ౨॥
హాప్రియా యిడుముల జెందగా నీవెటు
యేగతి నిలుతును తాపామాయో॥ 3।

అనుబంధము 24.

అఠాణరాగము—ఆదితాళము.

క్రోధవర్మ:—అకటామదనా యికనేమి సేయుదు వెకార్రశెంచితిని
నకార్రబెంచితిని నకార్రస్రుకిర్రతి॥
వినయా తనయా మననేను ధారుణి
హీనునీ మాడ్కని దినాతచెందితి॥

అనుబంధము 25.

కానడరాగం—చాప్ తాళం.

అనంగవర్మ:—నైపానోపా - సారసాంబకు బాధా॥ పల్లి॥
సరసిజాలోచన సరసాకు రాదాయె

నీరజనయనాను నిరతాము జేరుచూ
మారూని క్రీడలా మురగాక నిలువా॥ ౧॥

కాంతామణినిజేరి కలకాలమూ కూడి
కలమా నిరంతుల కలపాక నిలువా॥ ౨॥

## అనుబంధము 26.

### బ్యాండు రాగము—ఆదితాళము.

కళావతి:—ఏమీమోహామా వదలుదు నేమీ దేహాము
మరుడునాదు మనముగూల్చి మానమునీడగలఁ
చెజూడు మానావనా మతిధానా ముదమునా
అనఁగి పెనఁగి మనుపమా॥ ౧॥

హితునినిన్ను సతతమూన కూడుచు వేడుచు
కలతునిన్ను రా - రా - మారా - మతివరా
హితకరా సతినిరతిన గలయరా॥ ౨॥

## అనుబంధము 27.

### నోటుస్వరము—ఏకతాళము.

అనంగవర్మ:—బోటిమరుని ఆటాలకు - ఆటాలకు పాటలకు
రా - తావె వేవేగ - రంజిల్ల గాను॥

కళావతి:—రా - రా - కందర్పక్రీడాలకు - క్రీడాలకు
మేడాలకు రాపోయి వేవేగ రంజిల్ల గాను॥

అనంగవర్మ:—కాంతారో కంతూని రంతూలు తాళా
ఇంతీరో సంతాప మెంతేనిజాలు మంతనము
సంతరించి కాంతునినిగాక వడిచెంతకూను
చేరరావే నైపజాలనే॥ ౧॥

కళావతి:—భూరిగసౌఖ్యాము లారయనందా చేరరార హేరాళివి
నాళితాళాతాయ మారవలదు లేరదారగానను
బ్రోవరాదా వేగరార యోజాపజాలనే॥

## అనుబంధము 28.

### అసావేరి రాగము—ఏకతాళము.

కళావతి:—మోహనరూపా రా మా దామునందన సదయహృదయ
సారెకు వేడితి ....... ..॥మా॥
ఆమోదముదీరతి బలునా మాదుర యింకతీ
కామూని కావర మీగతి పోనీర॥ ౧॥
తాంబూల మిత్తుగనూ - సఖి - తొ పామునార్తు
నినూతాళిమి మీరగ తాళునుశయ్యను॥ ౨॥

## అనుబంధము 29.

### బిలహరి రాగం—ఏకతాళం

కళావతి:—అయ్యారేవీని వెతలారె నీకసయ్యాట ముచ్చాట చాలునిక
దారణితరులు బారూనిశరముల పూరూ
మచిత్తము గారింతు రిలనహా॥ ౧॥
కారాను యిడుములు జెరీన విటునిక
చెరుచువానీని జేర్చూమ సుముఖులు॥ ౨॥

## అనుబంధము 30.

### నవరోజు రాగము—ఏకతాళము.

పార్థియా:—దేశకోశా ఏది - నివాసమేదీ - మీమతొ మెది - మీకులా మెది
ఏందుకు మీరువచ్చితి రిందు
యింతులవార్త తెలుపుడి మీరూ॥

## అనుబంధము 31.

### కాపీ రాగము—రూపక తాళము.

కళావతి:—పూవుబోణీ ధారణీనీవు బలుపుణ్యాత్మవు నిజము
మారురూపుని దారవగుచు మహిమాన్విత వైతివి॥ ౧॥

## అనుబంధము 32.

### అసావేరిరాగము—ఆదితాళము.

కళావతి:—రామా - పతినినే - మానగలనె
యేమని నేమనియుందు జగతిని - నిలువగలనె - మహి॥ రా॥
కాంతారములా - కాంతుడేగదా - ఇంతీ - నేను - కాంతునివదలీ
సంతసమ్మున - మానగగలనె - నెలవిడుమా సఖీ॥ రా॥ ౧॥

## అనుబంధము 33.

### రాగము—తాళము.

శిలాదిత్యు:—సతిఖేదమారే మోదామాయే మదికి నెంతయో
నాదువార్తా వ్యాకులమే నాగయానరో నాతినామా శక్తిచనే
భూతలమూననేనూమనా - ఖ్యాతిలేదూ కాంతివీడూ కాలమాయెనే॥
నాదుతండ్రి ఖానుడయ్యె ఆదరమునం యిచ్చి
నట్టిమేదురంపు అశ్వమేదీ కానదాయెనే॥

## అనుబంధము 34.

### కమాజ్ రాగము—ఏకతాళము.

కళ:—నీకిదియేలా పతినిటులా కలచుట

మద:—మానినిమూనా మనమున నా వనితను

కళ:—అలా - మేలా - చాలూ - వలదిది, వలదిది

మద:—నూనబాణ కేళిగా గలయగ దలకును

కళ:—హితమే మతమే పతినిగా జెఱపగా మతిహీనత సమ్మతముగు నెటువిడు

మద:—అతివా శతివాక్య తతిగా మతినిగా వెతయగా చితినిగా సతతముగలచును

కళ:—చలమున ఫలములు గలుగునె నీకు గలచును కలతలు
కలుగుగా చెలుల్ వలదిదియేలా ఖల గుణమేలా
సైలని లీలలు మేలగునేలా నెలతను నెచుట న్యాయమమిర॥

మద:—ములుకులు పలుకులు పలుకగనేలా కలకీ నెలతకా
కలయికతాళా అళికుల వేణికా మనములరంగకా లీలలకేళినిఁ
బాసెదబాళికా చెలియరొ నేమముచెందెదగను

అనుబంధము 35

రాగం—తాళం.

మద:—భూరి మోహంబు మీరగాను మారుకేళికా
మీర - మీరి - నారిచేరి - కేరికూడుదుకా
ఇవుడే వేగబోయి సహాసంబు మీరగా మదనకదన మొదవగా
కాననమందు చానను పొంది సంతసమందు
భూరిమోహసంబు తెలియదాయె మోహపాశమై
మోసమూని బాసగసద్రోని పోయెద॥ ౧॥

అనుబంధము 36.

మాలకంస్ రాగము—త్రిశ్రగతితాళం.

కళావతి:—మోహనాంగా నాదు - ముదాముగనే - మానసాము చాలా
ముదాముగనే - మానసాము చాలా
ఇహలోకా సౌఖ్యమాయెఁ ముదముగనే మానసాము చాలా॥ ౧॥
మీరకు నీమాటలను - సారస నేత్ర - చారుతరా - సారాముదమ్ముగనూ
వినుమనవి అనామయ మీరకువచనము మనమున మానధనా
లాలింపుము లోలాధిక లీలాముదాముగనే॥ మానసాము చాలా॥ ౨॥

అనుబంధము 37.

బేహాగ్ రాగము—ఏకతాళము.

కళావతి:—నారీ - బలామిలా - జూపగా - బూనెదనుఁ
ముదముమీర - మోసామార - మోహనాంగునికా
ఘటులనైనా - మోసగించి - దాటించెదనేకా - వదలాను నేనువాని
వదలాను నేనువానినై వదలాను నేనువాని॥ నారీ॥

## అనుబంధము 38.

### నవరోజురాగము—ఏకతాళము.

కళావతి:—కుటిలాశాయా - మాటలేల - మీ సాముఖికమేలా
మేతానె - యీలాగు - మానహానా॥

మద:—సారసాక్షిరో - దయబూనూ - సర్వాపరాధి నేనూ
సత్యమ్ము - నీపాద - మానచౌనా॥

కళావతి:—పటు యేవాన మూనమూరి - క్రొవ్వనమతిగేరి
ఆవ్వారిజాక్షిని మతిగోళ॥

మద:—హృద యేశ్వరి - కోపమూనా - న్యాయమామెనా పయిణా
తప్పైనా - సైరింపు - వేగచౌనా

కళ:—మోస - మేల - నీకు - నాతోడ - విరాగమా

మద:—వాని - గాను - నీదు - దానూడు - నీవాడనె

కళ:—వంచాన - చేయాగ - నీకగునె

మద:—వంచాల - నేత్రి - నీశరణంటిని.

కళ:—మతిమంతుడవై - మనుమంతూడవై - హితమంతుడవై

మద:—ఇది - తాదా - నీదయా॥

## అనుబంధము 39.

### ఇంగ్లీషు నోటురాగము—త్రిశ్రగతితాళము.

శ్రీవరాముణాను రాహూరా కరుణాకర రా
నిజభక్తభరణ చారుతరుణ శోకహరణ॥ శ్రీ॥
నీకోమల పదసారసభక్తి దానమునుగ నీ
కైవల్య పదసౌఖ్యము ప్రాకటముగనుగ
నాకు నొసంగము కరుణా జొచ్చితిశరణుగ నాకీ
వినుతాకరి సౌఖ్యకృతా సూవితతా దీన హితా వెదనుతా॥ శ్రీ॥

సమాప్తము.

